


# చందమామ

సంపుటి 104 జనవరి 2001 సంచిక 1

ఈ సంచికలో...


కథలు

మాటతప్పని ఇరుగుపొరుగు! పేజినం.08

తగినవరుడు (బే.క.) పేజినం.09

బైరాగి బడాయి పేజినం.21

విధేయత! పేజినం.26

రాజమార్గం పేజినం.43

మూలికారహస్యం పేజినం.58

అంటరానివాడు పేజి నం.64

జానపద సీరియల్

యక్షపర్వతం -1 పేజినం. 15

పౌరాణిక సీరియల్

మహాభారతం-60 పేజినం.47

చారిత్రక విశేషాలు

20వ శతాబ్దంలో భారతదేశం పేజినం.27

చిత్రకథ

పిశాచి నాటకం - 2 పేజినం.54

శీర్షికలు

చందమామ కబుర్లు పేజీనం.06

ఈ నెలలో జన్మించిన ప్రముఖులు పేజినం. 14

భారత సంస్కృతి-చరిత్ర - 12 పేజినం.22

మనదేశం గురించి తెలుసుకుందాం క్విజ్ పేజినం.62

ఫొటో వ్యాఖ్యల పోటీ పేజీనం.66


ఈ నెల విశేషాలు



తగిన వరుడు
(బేతాళ కథలు)

యక్షపర్వతం



భారత సంస్కృతి చరిత్ర



రాజమార్గం



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai-600 026 on behalf of Chandamama India Limited, No.82, Defence Officers Colony, Ekattuthangal, Chennai - 600 097. Editor: Viswam

దూరతీరాల్లో వున్న

**మీ వాళ్ళ కోసం**

ముచ్చటగా ఇవ్వతగ్గ

ఏకైక బహుమతి



# చందమామ

వారి భాషల్లో
వారితో మాట్లాడే
చందమామ ఒకటివ్వండి!

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ,
కన్నడ, మలయాళం, మరాఠీ, ఒరియా, సంస్కృతం,
తమిళం, తెలుగు

చందా

ఎయిర్ మెయిల్ ద్వారా అన్ని దేశాలకు
పన్నెండు సంచికలు రూ. 900

మన దేశంలో బుక్ పోస్ట్ ద్వారా
పన్నెండు సంచికలు రూ. 120

సొమ్ము డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గానీ మనీఆర్డరు ద్వారా గానీ
చందమామ ఇండియా లిమిటెడ్ పేరిట ఈ క్రింది
చిరునామాకు పంపండి:

PUBLICATION DIVISION
CHANDAMAMA INDIA LIMITED
New 82 (Old 92), Defence Officers Colony,
Ekkatuthangal, Chennai - 600 097.


సంపాదకుడు
విశ్వం



ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
కొత్త నం.82 (పాత నం.92)
డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈక్కాట్టుతాంగల్,
చెన్నయ్ - 600 097.
ఇ.మెయిల్: Chandamama@ vsnl.com


అమెరికాలో
విడికాపీ $2
సంవత్సర చందా $20
సొమ్ము పంపవలసిన చిరునామా:
ఇండియా అబ్రాడ్
43 వెస్ట్ 24 స్ట్రీట్
న్యూయార్క్, ఎన్.వై 10010
ఫోన్: (212) 929-1727
ఫ్యాక్స్: 212-627-9503



సంచాలకులు
చక్రపాణి. బి.నాగిరెడ్డి

# నవ సహస్రాబ్దికి స్వాగతం!

2000 వ సంవత్సరం నవ శతాబ్దికీ, సహస్రాబ్దికీ, ఆరంభమా కాదా అన్నది వివాదాస్పదవిషయమేకాని, 2001 వ సంత్సరారంభం నూతన శకానికి నాంది అనడంలో అభిప్రాయ భేదాలు లేవు !

నూరేళ్ళ క్రితం ప్రపంచం ఎలా ఉండేదో మనకందరికీ తెలుసు. అదొక భిన్నమైన ప్రపంచం. కార్లు, విమానాలు, రేడియోలు, టీవీలు లేవు. ఇంటర్‌నెట్, ఇ-మెయిల్ సంగతులు సరేసరి. మరి, వెయ్యేళ్ళకు పూర్వం మనదేశం ఎలా ఉండేది? తంజావూరులో బృహదీశ్వరాలయం, భువనేశ్వర్‌లో లింగరాజమందిర నిర్మాణాలు అప్పుడే పూర్తయ్యాయి. అదే సమయంలో మహమ్మద్ గజినీ దండెత్తి వచ్చి భారతదేశాన్ని దోచుకుని అమూల్యమైన అనేక దేవాలయాలను నాశనం చేశాడు. అంటే — నిర్మాణం, విధ్వంసం ఒకేసారి జరిగాయన్నమాట. శతాబ్దాలుగా సాగుతూన్న మానవచరిత్ర ఇదే !

మనలోని విధ్వంసకర శక్తులకు లొంగిపోకుండా మన శక్తియుక్తులను నిర్మాణాత్మక మార్గంలో ఉపయోగించుకుంటూ ముందుకు సాగాలని యుగయుగాలుగా మహనీయులు ప్రబోధిస్తూవచ్చారు. అన్నీ కాకపోయినా చాలావరకు సమస్యలు మన మనసుల్లోనే ఉన్నాయి. కొన్నిటిని నాశపరచడం ద్వారా ఆ సమస్యలను పరిష్కరించడానికి పూనుకుంటున్నాము. అయితే, ఆ విధంగా ఏ సమస్యా పరిష్కారం కాదు కదా, మరింత జటిలమై కూర్చుంటుంది. ఉదాహరణకు,భారత విభజననే తీసుకుందాం. దేశాన్ని రెండుగా విభజించడంతో హిందూ-ముస్లిం సమస్య సమసిపోతుందని ఆశించాము. అయితే అది తీరక పోగా మరిన్ని జటిల సమస్యలు తలెత్తాయి. ఘర్షణ కొనసాగుతూనే ఉన్నది. దీనికి కారణం, సమస్య బాహ్యప్రపంచంలో కాకుండా మనుషుల మనసుల్లో ఉండడమే!

ఈ సత్యాన్ని గుర్తించి మానవజాతి అంతా ఒక్కటే అన్న ఉదాత్తభావాన్ని మనసుల్లో దృఢపరచుకోవడానికి సిద్ధమయినట్టయితే, మనం ఎన్నో అద్భుతాలను సాధించవచ్చు. ఈ కొత్త శతాబ్దం, నూతన సహస్రాబ్దం మనకు అందిస్తూన్న సందేశం ఇదే. ప్రపంచమంతా ఒక్కటే అని ఎందరెందరో ఎన్నెన్నో చెప్పారు; చేశారు. దానిని ఎంత త్వరగా సాధిస్తే అంత మంచిది!



# 2000 రికార్డులు

## 2000 వ సం॥లో కొన్ని విలక్షణమైన రికార్డులు



• 104 గంటల సేపు ఎడతెరిపి లేకుండా మైక్రో ఫోనులో మాట్లాడితే ఎలా వుంటుంది? మలేసియాకు చెందిన డిస్క్-జాకీ బర్హన్ మొహితారుద్దీన్ అక్టోబర్ నెలలో ఆ పనే చేశాడు. కోలాలంపూర్‌లోని బెస్ట్ 104 రేడియోలో అయన పనిచేస్తున్నాడు. డిస్క్ ప్లే చేస్తూ వాటిలోని సంగీత సాహిత్యాలను వివరిస్తూ ఉపన్యసించడం ఆదివారం మొదలుపెట్టి శుక్రవారం వరకు ఏకధాటిగా సాగించాడు. ప్రతి ఆరుగంటలకు ఒకసారి 15 నిముషాలు విశ్రాంతి తీసుకున్నాడు. ఇంతకు పూర్వం రికార్డు పదిగంటలు తక్కువ.

• సినిమాలో సంభాషణలు పలకడంలో పేరుగాంచిన స్వీడెన్ నటుడు లార్స్-గోరాన్ కార్ల్‌సన్. సెప్టెంబరు నెలలో మాల్మోలో జరిగిన పుస్తక ప్రదర్శనలో గట్టిగా కథలు చదివి వినిపించాడు. పిల్లలకు అనుకున్నారా? కాదు, పెద్దలకే! ప్రముఖ స్వీడెన్ రచయిత ఆగస్ట్ స్ట్రిండ్‌బెర్గ్ రచనలకు ప్రాచుర్యం కలిగించాలని ఈ ప్రదర్శన ఏర్పాటు చేశారు. రచయిత ఐదు పుస్తకాలను కార్ల్‌సన్‌కు ఇచ్చి అయనచేత శనివారం నుంచి ఆదివారం వరకు ఆపకుండా 25 గంటల సేపు చదివించారు. గంటకొకసారి 5 నిమిషాలు విశ్రాంతి తీసుకున్నాడు. ఈ విషయంలో వెనకటి రికార్డు 24 గంటలా 24 నిమిషాలు. అదృష్టవశాత్తు కార్ల్‌సన్ కంఠస్వరానికి ఏం కాలేదుగాని, నిద్రపోకుండా వుండడానికి అయన చాలా శ్రమపడవలసి వచ్చింది. మరి ఆయన శ్రోతల మాటేమిటి? అని దీనిని గురించి విన్నవారు ఆశ్చర్య పడ సాగారు.



• ఆస్ట్రియాకు చెందిన హాన్స్ స్క్వార్జ్ రాసి పంపిన సందేశం 44 సంవత్స రాల తరవాత అతనికే వచ్చి చేరింది. ఇది తపాలా ద్వారా కాదు. 1956 మెల్ బర్న్ ఒలింపిక్స్ చూడడానికి స్క్వార్జ్ ఆస్ట్రేలియాకు ఓడలో బయలుదేరాడు. ఒక సందేశాన్ని అతడు ఇంగ్లీషులోనూ, జర్మన్‌లోనూ రాసి ఆ కాగితాన్ని మడిచి ఒక సీసాలో వేసి సీల్ చేసి, హిందూ మహాసముద్రంలోకి విసిరివేశాడు. సముద్రం దానిని ఎక్కడికైనా తీసుకుని వెళ్ళి వుండవచ్చు. అయితే అది మళ్ళీ తనవద్దకే తిరిగి రావడం స్క్వార్జ్‌కు అమితాశ్చర్యం కలిగించింది. ఆస్ట్రియానుంచి అతడు న్యూజీలాండ్‌కు చేరి సముద్రతీరంలో స్థిరపడ్డాడు. ఆ ప్రాంతానికి కొంతదూరంలో అతడు 44 సంవత్సరాలకు పూర్వం వదిలిన సీసా అక్టోబర్‌లో అతని కంటబడింది. ఇది కోటికొక్కటి పది కోట్ల కొక్కటి జరిగే సంఘటన అని అతడు అన్నాడు.



• మామూలుగా పాదతలం నుంచి ఎవరెస్టు శిఖరాన్ని చేరడానికి రెండు నుంచి నాలుగు రోజులవరకు పడుతుంది. అయితే షెర్పా బాబూ ఛిరీ 17 గంటలు కావడానికి ఇంకా నాలుగు నిమిషాలు వుండనగానే దానిని అధిరోహించాడు. 2000లో అతడు ఈ ప్రపంచరికార్డును సృష్టించాడు. అది అతి వేగంగా కొండను ఎక్కడం అన్నమాట. 34 ఏళ్ళ ఛిరీకి ఇదొక్కటే రికార్డు కాదు. ఆయన 13వ యేట ఆశిఖరాన్ని ఎక్కాడు. అప్పుడ తడు పర్వతారోహణకు వచ్చిన విదేశబృందం వెంట బరువులు మోసేవాడుగా వెళ్ళాడు. 1989లో ఒంటరిగావెళ్ళాడు. ఇప్పటివరకు ఎవరెస్ట్‌ను 10సార్లు అధిరోహించాడు. 1995వ సం॥ లో 14 రోజుల లోపల రెండుసార్లు ఆ శిఖరాన్ని అధిరోహించాడు. 1999లో ఆక్సిజెన్ బాటిల్స్ లేకుండా అతడు శిఖరాగ్రంలో 21 గంటలు గడిపాడు. దీనిని గురించి ప్రస్తావించినప్పుడు 'చాలామంది అక్కడ ఫోటోలు దిగేంతవరకు పాదం మోపితే చాలు' అని అనుకుంటారని అతడు చెప్పాడు. ఛిరీ ఒక లక్ష్యం సాధించడానికే ఇవన్నీ చేస్తున్నాడు. అతడు షెర్పా పిల్లలకు తన గ్రామంలో ఒక బడిని ఏర్పాటు చేయాలనుకుంటు న్నాడు. బడికి వెళ్ళే అవకాశం లేకపోవడంతో తనలాగే తమ పిల్లలు కూడా నిరక్షరాస్యులుగా మిగిలిపోకూడదని అతడు ఆశిస్తున్నాడు.



# మాటతప్పని ఇరుగుపొరుగు!

భూషయ్య అనే సంపన్నుడు పట్టణం పొలిమేరల్లో ఒక ఇల్లు కొన్నాడు. ప్రశాంతంగా గడపాలన్నది ఆయన కోరిక. ఇంటి రెండువైపులా రెండు పాకలు తప్ప సమీపంలో ఇళ్ళు లేవు. తాను వెతుక్కుంటూ వచ్చిన ప్రశాంతత లభించినందుకు భూషయ్య ఎంతో సంబరపడిపోయాడు.

అయితే, ఆ ఆనందం ఎంతోసేపు నిలవలేదు. ఆ రాత్రి ఒక వైపునుంచి రంపపుకోతల శబ్దమూ, మరొకవైపునుంచి సమ్మెట మోతల శబ్దమూ వినిపించడంతో ఆయనకు నిద్రపట్టలేదు. మనసు కలత చెందింది.

తెల్లవారగానే నౌకరును పిలిచి విషయం కనుక్కోమన్నాడు. తూర్పువైపున వున్న పాకలో వడ్రంగీ, పడమర వైపునవున్న పాకలో కమ్మరీ ఉన్నట్టు తెలిసింది. ఇద్దరూ పేదవాళ్ళే. భూషయ్య మొదట వడ్రంగిని పిలిపించి, "నీకు వెయ్యి రూపాయలిస్తాను. ఇప్పుడున్న ఇల్లు వదిలి మరొక ఇంటికి వెళతావా?" అని అడిగాడు. "సంతోషంగా వెళతాను, బాబూ!" అన్నాడు వడ్రంగి. భూషయ్య వాడికి డబ్బిచ్చి పంపి, కమ్మరిని పిలిపించి అదేమాట అడిగాడు. వాడూ ఇల్లు మారడానికి సంతోషంగా ఒప్పుకుని డబ్బు పుచ్చుకుని వెళ్ళాడు.

సమస్యను తేలిగ్గా పరిష్కరించామన్న తృప్తితో ఆ నాటిరాత్రి భూషయ్య నిద్రకు సిద్ధమవుతూండగా ఉలిక్కి పడ్డాడు. సమ్మెట మోతలూ, రంపపుకోతలూ మళ్ళీ ఒక్కసారిగా ఆరంభమయ్యాయి. పట్టరాని కోపంతో భూషయ్యకు ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. తెల్లవారగానే నౌకర్ను పిలిచి, "ఆ ఇద్దరూ ఇళ్ళు మారుతామని డబ్బు పుచ్చుకున్నారుకదా! మళ్ళీ ఈ మోతలేమిటి?" అని అడిగాడు.

"వాళ్ళిద్దరూ తమవద్ద ఒప్పుకున్నట్టు ఇళ్ళు మారారు బాబూ. వడ్రంగి, కమ్మరి ఇంటికీ; కమ్మరి వడ్రంగి ఇంటికీ మారిపోయి, తమ పనులు మొదలుపెట్టారు. పేదవాళ్ళేగాని, వాళ్ళు ఇచ్చినమాట తప్పేవాళ్ళు కారు బాబూ!" అన్నాడు నౌకరు.



బేతాళ కథలు

# తగిన వరుడు!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అపరాత్రి వేళ, విషసర్పాలూ, ఢాకినీ శాకినీ లాంటి భూతగణాలూ తిరుగాడే ఈ శ్మశానంలో, నువ్వేలాంటి అతిక్లిష్టమైన సమస్యను పరిష్కరించగోరి, ఇంతగా శ్రమిస్తున్నావో, నాకు అర్థం కావడం లేదు. తమకు ఎదురైన అతిక్లిష్టమైన సమస్యను కూడా కొందరు వ్యక్తులు, తమ అనుభవశూన్యతతో పాటు, ఆలో చనాపటిమలేని కారణంగా,అతి సామా న్యమైన సమస్యగా ఊహించుకొని,




రానున్నమేలును దూరంచేసుకుంటారు. నువ్వూ అలాంటి కోవకు చెందినవాడివేమో అన్న అనుమానం కలుగుతున్నది. నీకు తగు హెచ్చరికగా వుండేందుకు, తనకు పట్ట నున్న అదృష్టాన్ని అనాలోచితంగా జారవిడుచు కున్న మాలతి అనే ఒక పేదవాడి కూతురు కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

వింధ్యాటవీ ప్రాంతంలో, ఒక కట్టెలు కొట్టేవాడు గుడిసె వేసుకుని, తన ఒక్కగా నొక్క కూతురు మాలతితో నివసిస్తూండేవాడు. మాలతికి చిన్నతనంలోనే తల్లిపోయింది. కట్నకానుకలు ఇచ్చుకోలేని కట్టెలు కొట్టే వాడికి, పెళ్ళీడుకొచ్చిన కూతురును గురించి చాలా బెంగగా వుండేది.

ఇలావుండగా — కట్టెలుకొట్టేవాడుండే ప్రాంతానికి ఆమడదూరంలోని ఒక గ్రామంలో వుంటున్న వాడి అక్కకు ఏదో అనారోగ్యం చేసింది. వాడు ఒకనాటి తెల్లవారుజామున అక్కను చూసేందుకు ప్రయాణమవుతూ కూతురుతో, ''ఆవు ఈనేలావుంది. అందుకే నిన్ను ఇంటవుంచి వెళ్ళక తప్పడం లేదు. ఎంత పొద్దుపోయినా రాత్రికి తిరిగివచ్చే స్తాను,'' అని ఒకటికి రెండు సార్లు చెప్పి, బయల్దేరిపోయాడు.

మాలతి స్నానం చేసింది. అంతలో ఆకాశం నిండా దట్టమైన మేఘాలు కమ్ముకుని, చల్లని గాలి వీచడం ఆరంభమైంది. మాలతి మల్లెపూలు కోసి మాలకడుతూ, బయట తిన్నె మీద కూర్చుని తీయగా పాట పాడడం ఆరంభించింది. పాట పూర్తయ్యేసరికి, మాల కట్టడం కూడా అయింది.

ఆమె మాలను తలలో తురుముకుం టూండగా, ''నీ కంఠస్వరం విని కోకిల సిగ్గు పడిపోతుంది. ఆహా, అద్భుతమైన కంఠ స్వరం!'' అన్న మాటలతో పాటు చప్పట్లు వినవచ్చి, ఆమె తృళ్ళిపడింది.

తర్వాత ఆమె తలతిప్పి చూడగా, గుడిసె చుట్టూవున్న కంచెకు అవతల ఒక యువ కుడు నిలబడివుండడం కనిపించింది.

మాలతి ఆశ్చర్యపోతూ చూసేంతలో, ఆ యువకుడు, ''నాపేరు సారంగపాణి. సంగీతప్రియుణ్ణి. నీ అమోఘమైన గానం వినడం అదృష్టంగా భావిస్తున్నాను,'' అన్నాడు.

అతడికి ఏంజవాబు చెప్పాలో పాలు పోలేదు, మాలతికి. అంతలో పెద్దపెట్టున ఉరుములతో వర్షం ప్రారంభమైంది. మాలతి వెంటనే సారంగపాణికేసి చేయి వూపుతూ, ''అయ్యయ్యో, తడిసిపోతున్నారు. లోపలికి

రండి!'' అంటూ, గుడిసెలోకి ఆహ్వానించింది. సారంగపాణి పరుగుపరుగున గుడిసె లోకి వచ్చి, శుభ్రంగావున్న గుడిసెను చూస్తూ, ''ముచ్చటైన కుటీరంలా వుంది, మీ ఇల్లు! ఈ అడవిలో ఒంటరిగా వుండడానికి భయంగా లేదా?'' అని అడిగాడు.

''ఇక్కడే పుట్టిపెరిగిన దాన్ని, భయం దేనికీ! అయినా, నాతోపాటు మానాన్న కూడా వుంటాడు,'' అంటూ మాలతి, అతడు కూర్చునేందుకు నులకమంచం వాల్చింది.

ఇంతలో, ''అయ్యా! లోపలవున్న వారెవరు? వర్షంతగ్గేలాగాలేదు. లోపలికిరావచ్చా?'' అంటూ, ఎవరిదో కేక వినబడింది.

గుడిసె తలుపు వారగా లాగి బయటికి చూసిన మాలతికి, బయట నవమన్మథుడిలా వున్న యువకుడొకడు నిలబడివుండడం కనిపించింది. ఆమె చప్పున తలుపు బార్లా తెరిచి, ''రండి, బాగా తడిసినట్టున్నారు,'' అంటూ అతణ్ణికూడా లోపలికిఆహ్వానించింది.

ఆ అడవిలో ముద్దమందారంలా వున్న మాలతిని చూసి, ఆ యువకుడాశ్చర్య పడుతూ, ''నా పేరు సుందరకపిళుడు. స్నేహితుడి పెళ్ళికి వెళుతూ ఈ వానలో చిక్కుకు పోయాను,'' అన్నాడు లోపలికి వస్తూ.

''మీలాగే వర్షంలో చిక్కుపడ్డ మరొకరు!'' అంటూ మాలతి, ఆ యువకుణ్ణి సారంగపాణికి పరిచయం చేసింది.

ఆ మరుక్షణం, ''అనుమతీ, ఆహ్వానాల్లాంటివేమీ లేకుండా, లోపలికి వస్తున్నందుకు మన్నించండి!'' అంటూ వర్షంలో తడిసి మరో యువకుడు లోనికివచ్చాడు. మాలతి, అతడికేసి చూసి ఏదో అనబోయేం



తలో, ఆ యువకుడు, ''నా పేరు భీమశంకరుడు. వ్యాపారం పనిమీద పట్నం వెళుతూ, వానలో నిలువెల్లా తడిసిపోయాను,'' అంటూ, తనకు తానుగా పరిచయం చేసుకున్నాడు.

ఆ తర్వాత కొంతసేపటికి వర్షం తగ్గుముఖం పట్టింది. ఇంకా సన్నగా చినుకులు పడుతూండగానే బయల్దేరిన సారంగపాణి, గుడిసె బయటకు వచ్చిన మాలతితో, ''నీ అద్భుతగానం, ఇంకా నా చెవుల్లో మారుమోగుతున్నది. నువ్వు నచ్చావు. రేపే మా అన్నయ్యను, మీనాన్నతో మాట్లాడడానికి పంపిస్తాను,'' అని, చిన్నగా ఆమెకు మాత్రమే వినపడేలా చెప్పి వెళ్ళిపోయాడు.

సుందరకపిళుడు వెళ్ళేముందు, ''నీ అందం అపూర్వమైనది. నా అందానికి తగిన వధువు దొరుకుతుందోలేదో అన్న బెంగ తీరిపోయింది. రేపే పెళ్ళిమాటలకు, మా అమ్మా



నాన్నలను పంపిస్తాను,'' అని రహస్యంగా మాలతికి చెప్పి వెళ్ళిపోయాడు.

భీమశంకరుడు వెళ్ళేముందు, ''నువ్వు నాకు మహబాగానచ్చావు. నాది పట్నంలో లక్షలమీద నడిచే వ్యాపారం. నాకు పట్న జీవితం విసుగనిపించినప్పుడల్లా, అందంగా వున్న ఈ అడవి ప్రాంతాన కొన్నాళ్ళు వుండదలిచాను. మీనాన్నతో మన పెళ్ళి విషయం మాట్లాడేందుకు రేపే, మా మేన మామా, మేనత్తలను పంపుతాను,'' అని చెప్పి అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

సూర్యాస్తమయం వేళ, మాలతి ఆవుకు మేతవేస్తూండగా కట్టెలుకొట్టేవాడు తిరిగి వచ్చాడు. మాలతి, అతడు కాళ్ళు కడుక్కు నేందుకు చెంబుతో నీళ్ళు ఇస్తూ, ''అత్త య్యకు ఎలావుంది, నాన్నా,'' అని అడిగింది.

''జబ్బు అంత తీవ్రంగా లేకపోయినా, తాను మరెంతోకాలం బతకనన్న దిగుల్లో వున్నది అక్కయ్య. తన ఒక్కగానొక్క కొడుకు రమాపతి పెళ్ళి కళ్ళచూడకుండానే పోతా నేమో అన్నది, ఆమె బెంగ,'' అన్నాడు వాడు.

''ఈ దిగుళ్ళూ, బెంగలూ ఎందుకు! బావకు, తనకు నచ్చిన అమ్మాయినెవర్న యినా చూసి పెళ్ళి చేయొచ్చుగదా,'' అన్నది మాలతి చిరుకోపంగా.

''మీ బావ రమాపతి పెళ్ళి విషయంలో అక్కయ్య పెద్ద పొరబాటే చేసింది. తన కొడుక్కు పెద్దపెద్ద కట్నాలతో పిల్లనిచ్చే వాళ్ళు వస్తున్నారని, నాతో అంటూండేది. మనం అలాంటి కట్నాలివ్వలేం కనక, నిన్ను కోడలుగా చేసుకోమని అడిగే ధైర్యం నాకు లేకపోయింది. ఇప్పుడు తనే ఆ విషయం కదిపి, నీకు తన కొడుకు తాళి కట్టడం చూశాక, ఏ దిగులూ చింతా లేకుండా కళ్ళు మూసేస్తాననేసింది. నేను, ఈ పెళ్ళి నాకు ఇష్టమే అన్నాను, కాని, రమాపతి, నీ అభి ప్రాయమేమిటో ముందు తెలుసుకోమ న్నాడు,'' అని చెప్పాడు కట్టెలుకొట్టేవాడు.

మాలతి చిరునవ్వు నవ్వి, ''ఈ ఉదయం ఇక్కడ చాలా పెద్ద వాన కురిసింది. ఆ సమ యంలో, వానలో తడుస్తూ మనింటికి ముగ్గురు అతిథులొచ్చారు. వాళ్ళల్లో ఒకడు సంగీతప్రియుడు, మరొకడు మహా అంద గాడు, ఇంకొకడు వ్యాపారంలో లక్షలు ఆర్జిస్తున్నవాడు. ఈ ముగ్గురిలో ప్రతిఒక్కడూ నన్ను పెళ్ళిచేసుకుంటానని చెప్పి, చూపు లకు తమ బంధుగణాన్ని పంపుతామని వెళ్ళారు,'' అన్నది.

''అలాగా! ముగ్గురూ మంచి ఆస్తిపాస్తు లున్న వాళ్ళే అయుంటారు. అర్థం పర్థం

లేని ఆటంకాలు పలికే, మీ రమాపతి బావ సంగతి అలావుంచుదాం. నువ్వు, ఈ ముగ్గురిలో ఎవర్ని తగిన వరుడనుకుంటున్నావు?'' అని అడిగాడు కట్టెలు కొట్టేవాడు.

ఆ మాట వినగానే మాలతి క్షణం కూడా ఆలోచించకుండా, ''నాన్నా! నేను రమాపతి బావనే చేసుకోదలచాను,'' అన్నది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, తన పెళ్ళి విషయంలో, మాలతి పెద్ద పొరపాటు చేసిందని తెలుస్తూనే వున్నదికదా! ఆమెను తమకు తాముగా కోరి, వివాహమాడతామని చెప్పిపోయిన ముగ్గురు యువకులూ నాగరికులు, మంచి ఆస్తి పాస్తులున్నవాళ్ళు. మాలతి ఆ ముగ్గురిలో ఎవరినో ఒకరిని వరించక, అంతగా ఆస్తీ, చదువు సంధ్యలూ లేని బావ రమాపతిని పెళ్ళాడతాననడానికి కారణం జీవితభాగస్వామిని ఎన్నుకోవడంలాంటి క్లిష్టమైన సమస్యను, అతి సామాన్యమైన విషయంగా భావించడమే గదా? ఇది, పట్టనున్న అదృష్టాన్ని చేజేతులా జారవిడుచుకోవడం కాక మరేమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఏది క్లిష్టమైన సమస్య, ఏది అతి సామాన్యమైన సమస్య అనేది, ఆయా వ్యక్తుల మానసికస్థాయీ, గతానుభవాలనుంచి గడించిన వివేకంలాంటి వాటిమీద ఆధారపడివుంటుంది. తన తండ్రి ప్రశ్నకు, మాలతి క్షణం కూడా ఆలోచించకుండా, రమాపతిని పెళ్ళాడతాననడాన్ని బట్టి, తన పెళ్ళి విషయం, ఆమెకు అతి సాధారణ విషయంగానే తోచడం. ఇందుక్కారణం, తనను పెళ్ళాడతామన్న ముగ్గురు యువకులూ, ఆమె ఇష్టాయిష్టాల గురించి ఆలోచించనే లేదు. కాని, రమాపతి మాత్రం మాలతి, తనను పెళ్ళాడడానికి ఇష్టపడుతున్నదో లేదో తెలుసుకోమన్నాడు. పెళ్ళిలాంటి అతి ముఖ్యమైన విషయంలోనే తన అభిప్రాయం అడగనివాళ్ళు, పెళ్ళయ్యాక తనను మనిషిగానే గుర్తించకపోవచ్చు! అందువల్ల, ఆమె నిర్ణయంలో, అదృష్టాన్ని జారవిడుచుకోవడం అన్నప్రశ్నే తల ఎత్తదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.

— (కల్పితం)

*[ఆధారం : మాచిరాజు కామేశ్వరరావు రచన]*



## ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

# మహాదేవ గోవింద రనడే

"గడచిపోయిన భారతదేశాన్ని మళ్ళీ తీసుకు రాలేము.అయితే,భవిష్యత్ భారతదేశాన్ని తీర్చి దిద్దుకోవడం మాత్రం మన చేతుల్లోనే ఉన్నది. ఆవిర్భవించనున్న భారతదేశంలో కుల, మత, జాతి, వర్ణ భేదాలకు స్థానం ఉండకూడదు. మనం మొదట భారతీయులం. ఆఖరివరకు భారతీయు లమే!" అన్న సందేశంతో జాతిని జాగృతం చేశాడు ప్రముఖ సంఘసంస్కర్తా, విద్యావేత్తా అయిన మహాదేవ గోవింద రనడే. ఆయన సందేశంలోని చివరి పలుకులు ఆనాటి నాయకుల హృదయాలలో ప్రతిధ్వనించాయి.



ఆయన ప్రచారం చేసిన సంస్కరణలలో ప్రధానమైనది స్త్రీ విద్య. అప్పటి సంప్రదాయ చాందస సమాజం ఆయన మాటలలోని సత్యాన్ని గుర్తించ లేకపోయింది. ఆయన దీనిని ఆచరణలో చూపాలని చదువు రాని తన పదకొండేళ్ళ భార్య రమాబాయికి చదువు నేర్పిం చాడు. ఆయన ఒక ఇంగ్లీషు పంతులమ్మను తన భార్యకు చదువు చెప్పడానికి ఏర్పాటు చేశాడు. అది ఆయన ఇంట్లోని మిగతా ఆడవాళ్ళకు ఆగ్రహం తెప్పించింది. పంతులమ్మ మిస్ హర్ఫాన్ వచ్చి వెళ్ళాక రమాబాయికి స్నానం చేయించేవాళ్ళు.

1842 జనవరి 18వ తేదీ నాశిక్ జిల్లాలోని నిఫాడ్‌లో మహదేవ్ జన్మించాడు. ఆయన తండ్రి గోవిందరావు రనడే కొల్హాపూర్ సంస్థానంలో అధికారిగా ఉండేవాడు.

మహదేవ్ విద్యాభ్యాసం కొల్హాపూర్ మరాఠీ స్కూల్లో ప్రారంభమయింది. పదమూడోయేట బొంబాయికి వెళ్ళి ఎల్ఫిన్‌స్టన్ విద్యాలయంలో చేరాడు. మెట్రిక్యులేషన్ నుంచి ఎం.ఏ.ఎల్. ఎల్.బి. (ఆనర్స్) వరకు ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణు డవుతూ వచ్చాడు.

ఆయన విద్యార్థిగా ఉన్నప్పుడు ఉపకార వేతనం పొందాడు. ఆ తరవాత ఆయన ఎందరో పేదవిద్యార్థులకు ధన సహాయం చేశాడు. ఆయన సంస్కరణప్రయత్నాలువిమర్శలకులోనయ్యాయి. అయినా ఆయన వాటిని పట్టించుకోలేదు.

ఆయనలో క్షమాగుణం ఎక్కువ. ఆయన 'ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్'(న్యాయమూర్తి) పదవిలో ఉండగా రైల్లో ప్రయాణం చేస్తున్నాడు. రైలు పెట్టెలోకి ఎక్కిన ఒక బ్రిటిష్ అధికారి కోపంతో ఆయన లగేజీని వెలుపలికి గిరవాటు వేశాడు. అయినా, రనడే ఎలాంటి చర్యాతీసుకోలేదు. అయితే కర్తవ్య నిర్వహణాసమయంలో ఆయన తప్పు చేసిన వారిని వదిలిపెట్టేవాడుకాడు. ఒక సారియాభైరూపాయలు దొంగి లించాడని ఒక ఆంగ్లేయుడికి ఆయన ఆరునెలల జైలుశిక్ష విధించాడు.అంతకు క్రితం వందరూపాయలు దొంగలిం చిన నేరానికి ఒక భారతీయు డికి ఆయన ఒక్క నెల మాత్ర మేజైలుశిక్ష విధించాడు.దీనిని పక్షపాత ధోరణి అని కొందరు విమర్శించారు. ఆంగ్లేయుడు పథకంవేసిదొంగతనంచేశా డనీ, భారతీయుడో ప్రలోభా నికిలోనై దొంగతనం చేశాడనీ రనడే సమాధానం ఇచ్చాడు.

ఏ.ఓ.హ్యూమ్ కాంగ్రెస్‌నుప్రారంభించి నప్పుడు రనడే ప్రభుత్వోద్యోగి కావడంవల్ల అనధి కారికంగా అందులో చేరాడు. కాంగ్రెస్ లక్ష్యాలకు ఆయన మద్దతు లభించడంతో, ఏ.ఓ.హ్యూమ్ ఆయన్ను తన రాజకీయగురువుగా అభివర్ణిం చాడు.

భారత జాతి పురోగతికి కృషి చేసిన ఆయన 1901 జనవరి 16వతేదీ కీర్తిశేషుడయ్యాడు.



# యక్షపర్వతం

కొన్నివందల సంవత్సరాల కిందట, బ్రహ్మపుత్ర నదీ ప్రాంతానగల అరణ్యాలలో, అనేకమైన ఆటవికజాతి మనుషులు నివసిస్తూండేవాళ్ళు. ఇలాంటి ఆటవిక జాతుల్లో ఒకటైన ఖడ్గమృగజాతివాళ్ళు, అరణ్యంలోగల కొండల్లో అరణ్యపురం అని ఒక పెద్ద పల్లె నిర్మించుకుని, అక్కడ నివాసం ఏర్పరచుకున్నారు. అడవిలోని ఖడ్గమృగాలను మచ్చిక చేసి, వాటిని వ్యవసాయప్పనులకూ, వాహనాలుగానూ ఉపయోగించుకుంటున్నందువల్ల, వాళ్ళకు ఖడ్గమృగజాతివాళ్ళన్న పేరు కలిగింది.

ఈ ఖడ్గమృగజాతివాళ్ళకు కొత్తగా అధికారానికి వచ్చిన అరణ్యమల్లు రాజుగా వుండేవాడు. ఇతణ్ణి అధికారం నుంచి తొలగించేందుకు, జాతివాళ్ళ గణాచారి ఒకడు గట్టి ప్రయత్నాలు చేశాడు. కాని, ఇద్దరు క్షత్రియ యువకుల సాయంతో అరణ్యమల్లు, ఆ గణాచారి మోసాన్ని బయటపెట్టించి, అతణ్ణి పులికి ఆహారంగా వేశాడు.

అరణ్యమల్లు సింహాసనానికి వచ్చి సంవత్సరం పూర్తయింది. ఆ రోజున ఖడ్గమృగజాతి వాళ్ళందరూ మహోత్సాహంతో వార్షికోత్సవం ఏర్పాటు చేశారు. రాజు అరణ్యమల్లు ఒక ఎత్తయిన ప్రదేశంలో, నగిషీలు చెక్కిన రాతి సింహాసనం మీద కూర్చుని ఎంతగానో ఆనంద పడుతున్నాడు.

అలాంటి ఉత్సాహసమయంలో ఇద్దరు ఖడ్గజాతివాళ్ళు, తమ వాహనాలమీద ఉరుకులూ పరుగులతో ఆ ప్రదేశానికి వచ్చి, వాహనాలు దిగి రాజుఅరణ్యమల్లుకేసి పోసాగారు. అరణ్యమల్లు మంత్రి శిలాముఖి, ఆ వచ్చిన వాళ్ళకు సౌంజ్ఞచేసి, వాళ్ళు దగ్గరకు రాగానే, "అలా కొంపలంటుకున్నట్టు రాజుగారి దగ్గరకు పరిగెత్తుతున్నారేం! మంత్రిని నేను లేనా?" అన్నాడు కోపంగా.



వచ్చిన వాళ్ళలో కొంచెం పెద్దవాడు, "అయ్యా, కొండవాగు పక్కనవున్న మన జొన్న చేల మీద ఎవరో కొత్తవాళ్ళుపడి కంకులన్నీ కోసుకుపోతున్నారు. వాళ్ళు ఈ పరిసరాల్లో ఎక్కడా లేని కొత్త రకం జంతువులమీద స్వారీ చేస్తూ వచ్చారు," అన్నాడు.

"ఏమిటా కొత్త రకం జంతువులు?" అని అడిగాడు మంత్రి శిలాముఖి ఎంతో ఆశ్చర్యంతో

"అవి ఏనుగులంత ఎత్తున్నాయి. పుల్లల్లాంటి కాళ్ళు. మెడలు కొంగమెడల్లా వంకర తిరిగి వున్నాయి," అన్నాడు వచ్చిన వాళ్ళల్లో చిన్నవాడు.

శిలాముఖి, ఆ వింతజంతువులను చూసి వచ్చిన వాళ్ళిద్దర్నీ అరణ్యమల్లు దగ్గరకు తీసుకుపోయి, వాళ్ళద్వారా తాను విన్నదంతా అతడికి చెప్పాడు.

"మనం కష్టపడి పండించిన పంటలు బందిపోట్లు దోచుకుపోతూంటే, ఆయుధాలు తీసుకుని బయలుదేరక, వింత జంతువుల గురించి ఆశ్చర్యపడుతున్నారా?" అంటూ అరణ్యమల్లు కోపంగా సింహాసనం మీదినుంచి లేచాడు.

అరణ్యమల్లు ఇలా అనగానే శిలాముఖి జనంకేసి తిరిగి, "ఇక ఈ ఉత్సవం ఇంతటితో చాలించండి! బందిపోట్లను హతమార్చి మన పంటల్ని కాపాడుకోవాలి," అన్నాడు పెద్దగొంతుతో.

ఆ వెంటనే అనేకమంది ఖడ్గజాతివాళ్ళు ఈటెలూ, కత్తులూ తీసుకుని బయలు దేరారు. కొందరు ఖడ్గమృగాల మీద సవారీ అయ్యారు. ఒక అనుచరుడు తెచ్చిన ఖడ్గ మృగాన్నెక్కి, మంత్రి శిలాముఖి ముందుగా బయలుదేరాడు.

వాళ్ళు వాగు ప్రాంతాలగల తమ పంట పొలాలను సమీపించేంతలో, అక్కడ కనిపించిన దృశ్యం అందర్నీ హడలగొట్టింది. బందిపోట్లు పాతికా, ముప్పైమంది వున్నారు. వాళ్ళు జొన్నకంకులు కోసి, వాటిని వికృతంగా వున్న మృగాల మీద గల పెద్ద పెద్ద సంచుల్లో పెడుతున్నారు.

బందిపోట్లనూ, వాళ్ళవెంట వున్న వికృత మృగాలనూ చూసి ఖడ్గజాతివాళ్ళు ఎంతగా భయపడ్డారో, అంతకన్నా మిన్నగా బందిపోట్లు, ఖడ్గమృగాలమీద ఎక్కివున్న వాళ్ళను చూసి భయపడిపోయారు.

బందిపోట్లలో ఒకడు, తన చేతిలోని ఈటెను పైకెత్తి పెద్దగా, "ఓహో, ఖడ్గమృగాలను ఎక్కివస్తున్న ఆటవికుల్ని చూడండి.

భయంగొలిపే ఖడ్గమృగాలను వాహనాలుగా ఉపయోగించేవాళ్ళు ఎంతటి మహా సాహసులైవుంటారు!'' అన్నాడు.

ఈ హెచ్చరిక వింటూనే బందిపోట్ల నాయకుడు, ఖడ్గజాతివాళ్ళకేసి పరీక్షగా చూశాడు. వాళ్ళ వాలకం చూస్తే, తమ మీదికి వచ్చిపడేందుకు తటపటాయిస్తున్నట్టు అతడికి తోచింది. అతడు వెంటనే తన అనుచరులతో, ''ఒరే, ఉష్ట్రవీరుల్లారా! ఈ ఖడ్గమృగం వాళ్ళు మనను చూసి బెంబేలుపడిపోతున్నారు. చూడండి! ఒక్కడైనా సాహసించి మన మీదికి కసిగా, వేగంగా వస్తున్నాడా! ఇదే మంచి అదను. వాళ్ళను చుట్టుముట్టి ఈటెలు విసిరి చెల్లాచెదురు చేద్దాం,'' అన్నాడు.

ఈ హెచ్చరిక వింటూనే మంత్రి శిలాముఖి , తన అనుచరులతో,''ఈబందిపోట్లు అంత ఎత్తు జంతువుల మీదవుండి, మనను తేలిగ్గా తమ ఈటెలతో పొడవగలరు. మనం వెంటనే వెనుదిరిగి సమీపంలోవున్న చెట్లకేసి పారిపోదాం,'' అన్నాడు.

శిలాముఖి తను ఎక్కివున్న ఖడ్గమృగాన్ని వెనక్కు తిప్పేలోపలే, బందిపోటు నాయకుడూ, అతడి అనుచరులు కొందరూ వేగంగా వచ్చి, అతణ్ణీ, అతడివెంట వున్నవాళ్ళనూ చుట్టుముట్టారు. శిలాముఖి ధైర్యంగా బందిపోటు నాయకుడి ఈటె దెబ్బలను తన ఈటెతో కాచుకుంటూ, ''జై, అరణ్యమాతా!'' అంటూ పెద్దగా కేక పెట్టి, తన అనుచరులతో, ''ఒరే, ఇక మనం ఈ బందిపోట్లను ఎదిరించలేం, అరణ్యపురం కేసి పారిపోవడమే క్షేమం!'' అంటూ తన వాహనాన్ని గట్టిగా అదిలించాడు.



ఆ సమయంలో దాపులనున్న ఒక చెట్టు కొమ్మల్లోంచి, ''మహామంత్రి శిలాముఖీ! పారిపోకు. బందిపోట్లు ఎక్కివచ్చిన జంతువుల్ని ఒంటెలంటారు. వాటిని గురించి లోగడ విన్నాను. అవి భయంకర జంతువులేం కాదు. నీ ఖడ్గమృగాన్ని వెనక్కు తిప్పి, నీ వెనక వస్తున్న ఒంటెను కుమ్మించు. నీ ఖడ్గమృగం కొమ్ముపాడి, ఇంద్రుడి వజ్రాయుధం పదునుకు ఏమాత్రం తీసిపోదు!'' అన్నమాటలు వినిపించాయి.

శిలాముఖి, ఆ మాట్లాడినవాడు క్షత్రియ యువకుల వెంటవుండేస్వర్ణాచారి అని గుర్తించాడు. కాని, అతడిలో నిలబడి బందిపోట్లను ఎదిరించే ధైర్యం పూర్తిగా నీరుకారిపోయింది. ఆ మాటలు వినిపించిన చెట్టుకొమ్మల కేసి తిరిగి చూడకుండా అతడు తన అనుచరుల వెనగ్గా అరణ్యపురం కేసి పారిపోసాగాడు.



స్వర్ణాచారి చేసిన హెచ్చరికను బంది పోట్లనాయకుడు విన్నాడు. అతడు, స్వర్ణా చారి వున్న చెట్టు కిందికి పోయి, "ఎవడ్రా అక్కడ? నా శత్రువులకు ఉపాయాలు చెబు తున్నావా?" అంటూ హుంకరించాడు.

"నా పేరు స్వర్ణాచారి. పద్మపురవాస్తు శాస్త్ర జ్ఞుణ్ణి. నాకు మీ ఒంటెజాతి వాళ్ళూ, ఆ ఖడ్గమృగజాతివాళ్ళూ — అంతా మిత్రులే!" అన్నాడు స్వర్ణాచారి.

"ఓహో, చాలా అతితెలివిగా మాట్లాడు తున్నావే!" అంటూ బందిపోట్ల నాయకుడు ఒంటెమీద లేచి నిలబడి కోపంతోఈటె పైకెత్తాడు.

ఆ హెచ్చరికతో స్వర్ణాచారి భయకంపి తుడైపోయి, చెట్టు మీద నుంచి కిందికి దిగుతూ, "అయ్యా, నన్ను చంపి పాపం మూటకట్టుకోకండి. వాస్తుశాస్త్రజ్ఞుడి హత్య నరకాలకు కారణమవుతుందని సర్వశాస్త్రాలూ ఘోషిస్తున్నవి!" అన్నాడు.

ఆ మాటలకు బందిపోట్ల నాయకుడు పెద్దగా నవ్వి, "అంత గొప్ప వాస్తుశాస్త్రజ్ఞుడివి, నగరాలు వదిలి, ఈ అరణ్యంలో కొండా గుట్టల మధ్య ఎందుకు తిరుగుతున్నావు?" అని ప్రశ్నించాడు.

"అయ్యా, గృహనిర్మాణ వృత్తిలో బతుకు తెరువు అంత బాగా సాగక, యంత్రనిర్మాణ రహస్యం కూడా తెలిసినవాణ్ణి గనక, విఘ్నే శ్వరపూజారి అనే ఒక అర్చకుడితో కలిసి మాయ ఏనుగును సృష్టించాను. కానీ, ఇద్దరు క్షత్రియ యువకుల కారణంగా, ఆ వృత్తిలో గట్టి చావుదెబ్బతిని, పద్మపురం వదిలి, ఈ అరణ్యాలు పట్టాను. ఇక్కడికి దగ్గర్లోనే ఒక పర్ణశాల వంటిది నిర్మించుకుని, ఆ ఇద్దరు యువకులు నివసిస్తున్నారు. వాళ్ళకు కొంచెం దూరంలో కొండరాళ్ళతో ఒక వాస్తు సమ్మత మైన గృహం నిర్మించుకుని నేనూ, విఘ్నే శ్వర పూజారీ వుంటున్నాం," అన్నాడు స్వర్ణాచారి.

"ఆ క్షత్రియ యువకులు ఇక్కడ తపస్సులాంటిదేమైనా చేస్తున్నారా?" అని అడిగాడు బందిపోట్ల నాయకుడు.

"వాళ్ళకు తపస్సు చేయవలసిన ఖర్మేం పట్టింది! ఇద్దరూ క్షత్రియోచిత విద్యల్లో కాకలు తీరినవాళ్ళు. దుష్టశిక్షణా, శిష్టరక్షణా చేస్తూండడం, వాళ్ళ నిత్యకార్యక్రమం," అన్నాడు స్వర్ణాచారి ఉత్సాహంగా.

"ఓహో, అలాగా!" అంటూ బందిపోట్ల నాయకుడు అవహేళనగా నవ్వి, "ఇప్పుడు మేంచేసిన పని — ఖడ్గజాతివాళ్ళ పండిన

పంటలు కోసుకుపోవడం దుష్టకార్యం అవుతుందా?'' అని అడిగాడు.

దానికి జవాబివ్వడానికి స్వర్ణాచారి ఒక క్షణం తటపటాయించి, ''అయ్యా, మీరు చాలా గొప్ప ధర్మసూక్ష్మానికి సంబంధించిన ప్రశ్న అడిగారు. నేనేం చెప్పగలను!'' అన్నాడు.

''సరే! ఆ క్షత్రియ యువకులుంటున్న పర్ణశాలకు దారితియ్యి,'' అన్నాడు బందిపోట్ల నాయకుడు.

ఈ బందిపోటు క్షత్రియ యువకుల్ని హతమార్చచూస్తున్నాడని, స్వర్ణాచారి గ్రహించాడు గాని, తను చేయగలిగిందేమీ లేదు గనక, వాళ్ళుండే కుటీరానికి బయలుదేరాడు. ఇంకా కుటీరం అంతదూరంలో వున్నదనగా అతడు, ఆ యువకుల్ని రానున్న ప్రమాదం గురించి హెచ్చరించదలచి, ''అయ్యా, మీరిక్కడే వుండండి. నేను పోయి వాళ్ళు కుటీరంలో వున్నారో లేదో చూసి వస్తాను,'' అన్నాడు.

ఇందుకు బందిపోట్లనాయకుడు చిన్నగా నవ్వి, ''ఒరే, నీ గుంటనక్కజిత్తులు నా దగ్గర చెల్లవు. సింధు ఎడారుల నుంచి, ఈ అరణ్యాలూ, కొండలూ చేరేలోపల నీబోటి వాళ్ళను చాలామందిని చూశాను,'' అన్నాడు.

ఇద్దరూ కలిసి కుటీరం దగ్గరకు వెళ్ళారు. ద్వారానికి అడ్డంగావున్న వెదురుతడికె తాడుతో ఒక మేకుకు గట్టిగా బంధించబడివున్నది. బందిపోట్ల నాయకుడూ, వాడి అనుచరుడొకడూ తాడును పక్కకు లాగి లోపలికి వెళ్ళారు. అక్కడవాళ్ళకు గోడలనుంచి వేళ్ళాడుతున్న పులీ, ఎలుగూ లాంటి మృగాల చర్మాలూ, గోడకు ఒక మూలగా ఈటెలూ,



విల్లంబులూ కనిపించినై. బందిపోట్ల నాయకుడు వాటిని వెంట తీసుకురమ్మని తన అనుచరుడికి చెప్పి, కుటీరం నుంచి బయటికి వస్తూనే, వాడితో, ''ఈ ఆచారిని కూడా ఒంటెమీద ఎక్కించు,'' అని ఆజ్ఞాపించాడు.

స్వర్ణాచారి, ''అయ్యా!'' అంటూ చేతులు జోడించి ఏదో చెప్పబోయేంతలో, బందిపోటు అనుచరుడు, అతణ్ణి పట్టుకుని ఒంటె మీద పడవేశాడు. స్వర్ణాచారి మతిపోయినవాడిలా ఒంటెమీద నిలబడి, ''రక్షించండి! రక్షించండి!'' అంటూ దీనంగా అరవసాగాడు.

స్వర్ణాచారి అరుపులు, అప్పుడే నదిలో స్నానం చేసి, ఏదో మంత్రం జపిస్తూ వస్తున్న అతడి మిత్రుడు విఘ్నేశ్వరపూజారి విన్నాడు. అతడికి ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది.

స్వర్ణాచారి అంతటివాడు, తనను రక్షించ మంటూ కేకలు వేయడమా? బహుశా, అతడికేదో పెద్ద ప్రమాదం కలిగివుండాలి! అనుకుంటూ అతడు క్షత్రియ యువకు లుండే కుటీరాన్ని సమీపించాడు. అతడి దృష్టికి ఒంటెలమీద వున్న బందిపోట్లూ, స్వర్ణాచారిని ఈటెతో బెదిరిస్తున్న బందిపోట్ల నాయకుడూ కనిపించారు.

విఘ్నేశ్వరపూజారికి మెరుపులా ఒక ఆలో చన వచ్చింది. కుటీరంలో నివసించే క్షత్రియ యువకులు ఒక సింహాన్ని పిల్లగా వున్న ప్పుడే పట్టుకువచ్చి, పెంచుతున్నారు. దాని పేరు పరశురాం! అది క్షత్రియ యువకు లతోపాటు స్వర్ణాచారికీ, విఘ్నేశ్వరపూజారికీ బాగా మాలిమి అయింది. క్షత్రియ యువ కులు కుటీరంలో వున్నప్పుడు, ఆ సింహం స్వేచ్ఛగా ఆ చుట్టుపక్కల తిరుగుతూ వుంటుంది. వాళ్ళు కుటీరంలో లేనప్పుడు దాన్ని కుటీరం వెనకవున్న పెద్ద కర్రలబోనులో వదిలిపోతూంటారు.

ఇప్పుడు విఘ్నేశ్వరపూజారికి, ఆ సింహాన్ని బోనులో నుంచి వదలడం వల్ల, స్వర్ణాచారిని బందిపోట్లనుంచి రక్షించవచ్చన్న ఆలోచన కలిగింది. స్వర్ణాచారి అరుపులు దాన్ని రెచ్చ గొట్టి, బందిపోట్లమీదికి దూకేలా కోపం తెప్పిం చవచ్చు!

విఘ్నేశ్వరపూజారి పరుగుపరుగున పోయి బోనులో నుంచి సింహాన్ని బయటికి వది లాడు. అది బయటికి వస్తూనే తల ఎత్తి ఒంటెలకేసి చూసి చిన్నగా గర్జిస్తూ, తలతిప్పి విఘ్నేశ్వరపూజారికేసి చూసింది.

సింహాన్ని బందిపోట్లపైకి ఉసికొల్పేం దుకు విఘ్నేశ్వరపూజారి పెద్దగా చిటికె వేసి చేయి ఊపేంతలో, దాన్ని చూసిన స్వర్ణా చారి మరింత పెద్ద గొంతుతో, ''పరశురాం! పరశురాం!'' అంటూ గట్టిగా చప్పట్లు చరి చాడు.

సింహం, స్వర్ణాచారిని గుర్తించింది. అది వెనక కాళ్ళమీద లేచి, జూలును ఒకసారి విదిలించి, భయంకరంగా గర్జిస్తూ బంది పోట్ల ఒంటెలకేసి దూకింది. సింహాన్ని చూస్తూనే ఒంటెలు చెల్లాచెదురుగా పరి గెత్తసాగాయి. ఒక బందిపోటు పట్టుతప్పి, చావుకేకలు పెడుతూ ఒంటె మీదనుంచి దభీమని కింద పడిపోయాడు. సింహం చెంగున ఎగిరి వాడిమీద పడి గొంతుగట్టిగా పట్టుకున్నది.

— (ఇంకావుంది)



# బైరాగి బడాయి

ఒకనాటి మిట్టమధ్యాహ్నం వేళ, అనంతయ్య దంపతులు భోజనానికి కూర్చోబోతూండగా వీధి గుమ్మంలోంచి, ''ఈ బైరాగి ఆకలి తీర్చి, పుణ్యం కట్టుకోండి!'' అన్న కేక వినవచ్చింది.

బైరాగులంటే భయమూ, భక్తీ వుండడం వల్ల అనంతయ్య లేచి వెళ్ళి, బైరాగిని సాదరంగా లోపలికి తీసుకువచ్చి, తమతో బాటు భోజనానికి కూర్చోబెట్టాడు.

భోజనం మధ్యలో బైరాగి, ''గతజన్మలో మీరు విదర్భరాజు అమరసింహుడి అమాత్యులు. మీ కుశాగ్రబుద్ధిని ఆనాటి ప్రభువులు, ప్రజలు వేనోళ్ళ శ్లాఘించేవారు!'' అన్నాడు.

అనంతయ్య సంతోషపడి, వడ్డన చేస్తున్న తన కూతురు జలజాక్షిని నెయ్యి కోసం పురమాయించి, ''స్వామీ! నా కూతురు జలజాక్షి గతజన్మ సెలవియ్యండి!'' అన్నాడు.

బైరాగి, జలజాక్షి గతజన్మ అవలోకిస్తున్నట్టు కళ్ళు మూసుకుని, ''ఆశ్చర్యం! గత జన్మలో ఈ జలజాక్షి, అమరసింహుడి ముద్దులభార్య,'' అన్నాడు.

అనంతయ్య దంపతులు బైరాగికి, కూతురుచేత మరికాస్త నెయ్యి వడ్డింపించి, ''స్వామీ, ఆ అమర సింహప్రభువులవారు, ఈ జన్మలో ఎక్కడున్నారు? ఎలా వున్నారు?'' అని అడిగాడు ఆసక్తిగా.

బైరాగి, అనంతయ్య దంపతులకేసి విచారంగా చూస్తూ, ''ఆ అమరసింహప్రభువు ఎవరో కాదు, నేనే!'' అన్నాడు.

ఇది వింటూనే అనంతయ్య కళ్ళెర్రచేసి, గోడవారగా వున్న దుడ్డుకర్ర చేతికి తీసుకోబోయేంతలో, బైరాగి విస్తరి ముందు నుంచి లేచి, ''ఇది 'కలియుగం! సత్యం పలకకురా, శిష్యా!' అన్న గురువు మాట వినకపోతినే!'' అంటూ వీధి గుమ్మంకేసి పరిగెత్తాడు.

— మల్లవరపు మనోహరరెడ్డి



# భారత సంస్క

**ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు -**
**తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!**

## 12. మహోన్నత స్థానం!



అదొక డిసెంబర్ నెల చల్లటి ఉదయం. దేవ నాథుడు శాలువా కప్పుకుని గదినుంచి వెలుపలికి రాగానే, సందీపుడూ, శ్యామలా మరొక కుర్రవాణ్ణి వెంటబెట్టుకుని పక్కింటి నుంచి నవ్వుతూ ఎదురువచ్చారు. ''తాతయ్యా! ఈ రోజు మీకొక కొత్త శ్రోత వచ్చాడు చూడండి. ఇతడు సిమ్లాలో ఉంటాడు. సెలవుల్లో ఇక్కడున్న మేన మామ ఇంటికి వచ్చాడు,'' అన్నాడు సందీపుడు.

''మరి, నువ్వింకా మీ స్నేహితుడి పేరు చెప్పనే లేదే!'' అన్నాడు దేవనాథుడు.

''ధ్రువుడు,'' అన్నాడు సందీపుడు.

''చాలా గొప్ప పేరు. ఆ పేరు కలిగివుండడం చాలా ఆనందకరమైన విషయం. అంతేకాదు; ఆ పేరుగలవాళ్ళు బాధ్యతాయుతంగానూ నడుచుకోవాలి,'' అన్నాడు దేవనాథుడు.

''బాధ్యతాయుతంగానా? అంటే ఏమిటి తాతయ్యా?'' అని అడిగాడు సందీపుడు.

''మీకు ధ్రువుడి కథ తెలుసుకదా?'' అని ప్రశ్నించాడు దేవనాథుడు.

''ధ్రువుడి పేరు వినడమేతప్ప, ఆ కథ నాకు తెలియదు తాతయ్యా,'' అన్నాడు సందీపుడు.

''నాకు తెలుసు తాతయ్యా!'' అన్నది శ్యామల.

''నీకు తెలుసా బాబూ?'' అంటూ ధ్రువుడి కేసి చూశాడు దేవనాథుడు.

''అతడొక రాజకుమారుడు. సవతి తల్లి చేత అవమానించబడి, అడవికి వెళ్ళి తపస్సు చేసి, ధ్రువనక్షత్రంగా మారాడు,'' అన్నాడు ధ్రువుడు.

''అవును, మరి అతడి కథ బోధించే పరమార్థం ఏమిటి?'' అని అడిగాడు దేవనాథుడు.

ముగ్గురు పిల్లలూ ఒకరినొకరు చూసుకున్నారు. శ్యామల అన్నకేసి చిలిపిగా నవ్వుతూ, ''ఏముందీ? మనకొక సవతితల్లి వుండి నిన్ను అవమానించిందనుకో. నువ్వు అడవికెళ్ళి తపస్సు చేసి నక్షత్రంగా కాదు; సరాసరి బొంబాయికి పారిపోయి తప్పకసినిమానక్షత్రం కాగలవు!'' అన్నది. అందరూ గొల్లున నవ్వారు.

''నవ్వు మంచి మందు కదా తాతయ్యా. ఆ మందును నేను మీకిచ్చాను. మరి నేను ఉచి



తంగా ముందులిచ్చే డాక్టర్ని కాను. నా ఫీజు ఎక్కడ? మీరు నాకు ధ్రువుడి కథ చెప్పాలి. అదే నా ఫీజు!'' అన్నది శ్యామల.

''అది అందరికీ తెలిసిన కథే కదా? నీకూ తెలుసన్నావుగా?'' అన్నాడు దేవనాథుడు.

''కథ చూచాయగా తెలుసు. పైగా ఆ కథ లోని అంతరార్థం, బోధించే పరమార్థం మాకెవ్వరికీ తెలియదు,'' అన్నది శ్యామల.

''అలాగా! అయితే చెబుతాను, వినండి,'' అంటూ దేవనాథుడు కుర్చీలో కూర్చుని కథ చెప్పడం ప్రారంభించాడు :

ఉత్తానపాదుడనే రాజుకు సునీతి, సురుచి అని ఇద్దరు భార్యలు. సునీతి సుగుణవతి; వినయసంపన్నురాలు. సురుచి అహంకారి. రాజు సురుచి మాట జవదాటేవాడు కాదు.

ఒకనాడు రాజు, రాణి సురుచి ఏదో ముచ్చ టించుకుంటున్నారు. ఆ సమయంలో ఐదారేళ్ళ పిల్లలయిన ధ్రువుడూ, ఉత్తముడూ ఆడుకుంటు న్నారు. ధ్రువుడు సునీతి కుమారుడు. ఉత్త ముడు సురుచి కొడుకు. కొంతసేపటికి ఉత్త ముడు ఆటలాడడం చాలించి, తిన్నగా వెళ్ళి తండ్రి తొడ మీద కూర్చున్నాడు. ధ్రువుడు కూడా అతడి వెనకనే వెళ్ళి తండ్రి తొడ మీద కూర్చోవ డానికి ఆశతో ఆయన్ను సమీపించాడు. అయితే రాజు పక్కనే కూర్చున్న సురుచి, ''ఆగు!'' అని ధ్రువుణ్ణి వారించి, ''నా బిడ్డ ఉత్తముడికి మాత్రమే తండ్రి తొడ మీద కూర్చునే హక్కు ఉన్నది. దానిని నువ్వు ఆశించడం మూర్ఖత్వం. నువ్వు నీ తండ్రి తొడ మీద కూర్చోవాలంటే నా కడుపున పుట్టాలి! మరెవ్వరి కడుపులోనో పుట్టి ఆ అదృష్టాన్ని ఆశించడం అవివేకం!'' అని ఈసడించింది.



కఠినమైన ఆమె మాటలు ధ్రువుడి లేత హృద యంలో సూదుల్లా గుచ్చుకున్నాయి. తండ్రికేసీ, సవతి తల్లికేసీ ఒకసారి దీనంగా చూసి, ఏడుస్తూ తల్లి దగ్గరికి వెళ్ళాడు. సునీతి బిడ్డను ఆప్యా యంగా ఒడిలోకి తీసుకున్నది. ధ్రువుడు సవతి తల్లి తనను అవమానించిన తీరును కన్నీళ్ళతో వివరించాడు. దానిని విని సునీతి కూడా కన్నీళ్ళు కార్చింది. ఆ తరవాత ఆమె బిడ్డను మంచి మాట లతో ఓదార్చింది : ''నాయనా! మనిషికి కావల సింది కేవలం తండ్రి లేదా రాజు ఆదరణ మాత్రమే కాదు; లోకాలన్నిటికీ తల్లీ, తండ్రీ అయిన భగ వంతుడి ఆదరణ. దేవుడి ఒడి ఒక్కటే అందరికీ శాశ్వత మైనది; సురక్షితమైనది. నువ్వు ఒక్కసారి అక్కడికి చేరావంటే ఆ తరవాత ఆ మహోన్నత స్థానం నుంచి దిగడం అంటూ ఉండదు.శాశ్వత మైన సురక్షితమైన పతనం లేని అత్యున్నతస్థానం అదొక్కటే. దేవుడి కరుణకూ, ప్రేమకూ మించి నది మరొకటి లేదు. దానిని పొందగలిగావంటే ఆ తరవాత ముల్లోకాలలో నిన్నెవ్వరూ అవమా నించలేరు.''



తల్లి మాటలను శ్రద్ధగా విన్న ధ్రువుడు, కన్నీళ్ళు తుడుచుకుని కొంతసేపు మౌనంగా కూర్చున్నాడు. ఆ తరవాత లేచి నిలబడి, "అమ్మా నేను దేవుడి ప్రేమకు పాత్రుణ్ణి కావాలి. తపస్సు చేయడానికి ఇప్పుడే నేను అడవికి వెళుతున్నాను, నన్ను ఆశీర్వదించు," అంటూ ఆమె పాదాలకు ప్రణమిల్లాడు.

ఇంత పసిప్రాయంలో తపస్సు చేయడం భావ్యం కాదని నచ్చజెప్పడానికి తల్లి ప్రయత్నించింది. కాని ధ్రువుడు పట్టుదలను వదలలేదు. ఆమె 'విజయోస్తు' అని ఆశీర్వదించి పంపింది.

దేవుడి కరుణపట్ల అచంచలమైన విశ్వాసంతో ధ్రువుడు అడవికి వెళ్ళి, ఏకాగ్రచిత్తంతో తపస్సు ప్రారంభించాడు. అడవిలో యథేచ్ఛగా తిరుగాడుతూన్న క్రూరమృగాలను చూసి అతడు భయపడలేదు. ఎండావానలే కాదు; ఉరుములూ, మెరుపులూ, పిడుగులూ మొదలైన ప్రకృతి వైపరీత్యాలు కూడా ధ్రువుడి పట్టుదలకు ఆటంకం కలిగించలేకపోయాయి. ఆఖరికి అతని భక్తికి మెచ్చి మహావిష్ణువు ప్రత్యక్షమై ధ్రువుడికి — పరిపూర్ణజీవితం సాగించాక శాశ్వతంగా ఆకాశంలో ధ్రువనక్షత్రంగా ప్రకాశించే వరమిచ్చాడు!

"ఇవాళ కూడా మనం ఉత్తర దిశగా ప్రకాశవంతమైన ధ్రువనక్షత్రాన్ని చూడవచ్చు. గొప్ప భక్తుడు — దివ్యసృష్టిలో శాశ్వతంగా ఒక అంగమయ్యాడు. ఒకనాడు అతడు ఆశించిన స్థానాన్ని చేరుకోనీక అతని సవతితల్లి అడ్డుపడింది. అయితే అతడు భగవద్భక్తి కారణంగా ఏ శక్తీ తనను పదవీచ్యుతుణ్ణి చేయలేని అత్యున్నత స్థానాన్ని అలంకరిస్తూ ప్రపంచానికి దారిచూపే వెలుగుచుక్కగా వెలుగొందుతున్నాడు!" అని ముగించాడు దేవనాథుడు.

"అతని స్థానం నుంచి చూస్తే మన బుల్లి భూగోళం మీది వ్యవహారాలూ; నీటి బుడగల్లాంటి మనుషుల సుఖదుఃఖాలూ, మిడిసిపాట్లూ— విచిత్రంగా, చిలిపిగా కనిపించవచ్చు కదా తాతయ్యా?" అన్నది శ్యామల నవ్వుతూ.

"అది నాకు తెలియదు తల్లీ! సరే, ధ్రువుడు దేవుడి నుంచి వరాలు పొందాక ఏమయ్యాడో మీకు తెలుసా?" అని అడిగాడు దేవనాథుడు.

"ధ్రువనక్షత్రమయ్యాడు. అంతే కదా?" అన్నాడు ధ్రువుడు.

"కాదు. విష్ణువు ఆదేశం ప్రకారం రాజధానికి తిరిగివెళ్ళి తండ్రి సింహాసనం అధిష్ఠించాడు. ఉత్తానపాదుడు వృద్ధుడయ్యాక వానప్రస్థాశ్రమం స్వీకరించి అడవికి వెళ్ళాడు. ధ్రువుడు తన తమ్ముడు ఉత్తముణ్ణి చంపిన యక్షుల మీదికి ఒంటరిగా వెళ్ళి వాళ్ళను ఓడించాడు. వాళ్ళ రాజు కుబేరుడు ధ్రువుడితో సంధి కుదుర్చుకుని వరాలెన్నో ఇచ్చాడు. ఇవన్నీ దేనిని సూచిస్తున్నాయో తెలుసా?" అని అడిగాడు దేవనాథుడు.

పిల్లలేమీ చెప్పకపోయేసరికి దేవనాథుడే మళ్ళీ ఇలా అన్నాడు : "దేవుణ్ణి తెలుసుకున్నాక కూడా మన బాధ్యతలను ఏమాత్రం విస్మరించకూడదు. మనుషులు హద్దులు దాటిన అహం

కారంతో, మిడిసిపడుతూ హీనంగా ప్రవర్తించడం నిజమే. అయితే, ఈ ఒక్క విషయం మాత్రమే మానవజాతికి సంబంధించిన పరిపూర్ణ సత్యం కాదు. మూర్ఖులు జ్ఞానులుగా పరిణమించే అవకాశం ఎప్పుడూ ఉన్నది. మనిషి అహంకారానికి అతీతంగా ఎదిగే అవకాశమూ ఉన్నది. ఆ స్థాయిని చేరుకున్న మనిషి — ఈ భూమి మీద దేవుడి పరికరంగా తన్ను తాను మలుచుకుంటాడు. ధ్రువుడు ఆ పనే చేశాడు. దేవుణ్ణి గ్రహించాక కూడా అతడు రాజుగా తన బాధ్యతలను నిర్వర్తించాడు. అయితే ఈ కథ — దేవుడి కరుణకు పాత్రమై, దివ్యశక్తిని గ్రహించడమే జీవిత పరమార్థంగా బోధిస్తున్నది. ఉత్తానపాదుడు ధ్రువుడికి ఆశాభంగం కలిగించినట్టు, ప్రతి ఒక్కరూ ఎదుటి వారిని ఆశాభంగానికి గురిచేయవచ్చు. అయితే, తనను పూర్తిగా నమ్మినవారిని దేవుడు ఎన్నడూ నిరాశపరచడం లేదు!'' అన్నాడు

''అవునూ, ధ్రువుడు మరణించాక నిజంగానే నక్షత్రంగా మారిపోయాడా తాతయ్యా?'' అని అడిగాడు సందీపుడు.

''అదీ ఒక ప్రతీక అనే నేను భావిస్తున్నాను. ఔన్నత్యానికీ, సుస్థిరతకూ సంకేతం ధ్రువనక్షత్రం. అల్పవిషయాలపట్ల ఆకర్షితులై, అసూయా ద్వేషాలతో సతమతమై సర్వనాశనం కావడం కన్నా — సర్వోన్నతమైన దివ్యశక్తి వైపు మన దృష్టిని కేంద్రీకరించినప్పుడు కలిగే సుగుణాలనూ, శుభ లక్షణాలనూ ధ్రువనక్షత్రం సూచిస్తుంది,'' అన్నాడు దేవనాథుడు.

''ఈ కథ అంతరార్థాలను విశదపరిచినందుకు కృతజ్ఞతలు తాతయ్యా,'' అన్నాడు ధ్రువుడు.

''ధ్రువుడి కథ మన పురాణాలలో తొలి దశకు చెందినది. మనిషికి భగవంతుడితో ఉన్న సంబంధం ఒక్కటే సత్యమైనది, శాశ్వతమైనది; మిగిలిన సంబంధాలన్నీ మార్పులకు లోబడినవే అన్న మహోన్నత సత్యాన్ని ఇది తెలియజేస్తుంది. ధ్రువుడు తపస్సు చేయడానికి ఏకాంతం కోసం అడవికి వెళ్ళాడే తప్ప, దేవుడు సర్వవ్యాపి అని భారతీయ తత్వచింతన విశ్వసిస్తున్నది. మరొక బాలరాకుమారుడి కథ ఈసత్యాన్ని తెలియజేస్తున్నది. నేనెవరిని గురించి చెబుతున్నానో చెప్పగలరా?'' అని అడిగాడు దేవనాథుడు.

''ప్రహ్లాదుడే కదా?'' అన్నాడు సందీపుడు ఉత్సాహంగా.

''అవును. దేవుడు సర్వాంతర్యామి అనీ, నిర్జీవమైన స్తంభంలో కూడా ఉన్నాడనీ ప్రహ్లాదుడు నిరూపించాడు. రాక్షసరాజు హిరణ్యకశిపుడి హింసాత్మక తిరస్కృతి కారణంగా — శాశ్వతమైన ఆ పరమసత్యాన్ని నరసింహావతారం ద్వారా హింసాత్మక మార్గంలోనే నెలకొల్పవలసి వచ్చింది!'' అన్నాడు దేవనాథుడు. — (ఇంకావుంది)



# విధేయత!

వేళ్ళచింతలగూడెంలో నివసించే ధనికుడైన పరంధామయ్యకు, తోటమాలి ఒకడు అవసరమై, తన మిత్రుడితో చెప్పాడు. అతడు శివయ్య, రామయ్య అనే ఇద్దరు కూలివాళ్ళను పంపుతూ, నచ్చిన వాడెవడికో ఒకడికి పని ఇవ్వమన్నాడు. పరంధామయ్య, ఆ ఇద్దర్నీ ఉదయమే తోటలోకి తీసుకుపోయి, "సాయంత్రం వరకూ పని చేయండి. నచ్చినవాణ్ణి పనిలోకి తీసుకుంటాను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

మిట్టమధ్యాహ్నం ఎండ ఫెళఫెళలాడే సమయంలో, పరంధామయ్య కూలీలను చూడవచ్చాడు. యజమాని రావడం చూసిన శివయ్య, ఒక్క ఉదుటున వచ్చి ఆయనకు కుర్చీవేసి, మంచి నీళ్ళు అందించి, విసనకర్రతో విసరసాగాడు.

పరంధామయ్య, రామయ్యను పిలిచి, "నేను వచ్చి ఇంతసేపయినా, నువ్వు నన్ను పట్టించుకోనేలేదు. యాజమాని పట్ల ఇది అవిధేయత కాదా?" అన్నాడు గద్దిస్తూ.

రామయ్య చేతులు నలుపుకుంటూ, "అయ్యా! క్షమించండి. పనిలోపడి మిమ్మల్ని చూడనే లేదు," అన్నాడు.

పరంధామయ్య, కూలీలిద్దరికీ మరికొన్ని పనులు పురమాయించి వెళ్ళిపోయాడు. మర్నాడు ఆయన ఇద్దర్నీ పిలిచి, రామయ్యను పనిలోకి తీసుకుంటున్నట్టుగా చెప్పాడు. ఇందుకు శివయ్య, "అయ్యా! నిన్న మీరు వచ్చినప్పుడు ఎన్నో సపర్యలు చేశాను. అటువంటి నన్ను వదిలి, అహంకారంకొద్దీ మిమ్మల్ని లక్ష్యపెట్టని రామయ్యకు పని ఇవ్వడం ఏం న్యాయం!" అన్నాడు బాధగా.

అందుకు పరంధామయ్య, "నీకు పనిపట్ల ఏకాగ్రత లేదు. రామయ్య నన్ను గౌరవించక పోయినా తన పనిని గౌరవించాడు. పనివాడు తన పని పట్ల శ్రద్ధ కలిగివుండడమే, యజమాని పట్ల చూపించే నిజమైన విధేయత!" అన్నాడు. — కొలూరి ప్రసాదరావు



# 20-వ శతాబ్దంలో భారతదేశం

## స్వాతంత్ర్యంకేసి పురోగమనం 1901 – 1921

వీరనారి ఝాన్సీలక్ష్మీబాయి, మరికొందరి నాయకత్వంలో – పరాయిపాలనకు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా అక్కడక్కడా తిరుగుబాటు జరిగింది. మాతృదేశ విముక్తి కోసం ఎందరో తమ జీవితాలను త్యాగం చేసిన వీరగాథ 'ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ' చరిత్రను 'స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర కానుకగా' చందమామ పాఠకులకు అందించాము. 1857వ సం॥లో జరిగిన ఆ తిరుగుబాటు తర వాత దాదాపు పాతిక సంవత్సరాలు – ప్రజాభీష్టాన్ని క్రమబద్ధం చేసి ఒక మార్గంలో నడిపించగల సంఘటిత ఉద్యమం రాలేదు.

కొన్ని విచిత్ర సంఘటనల పర్యవసానంగా – బ్రిటిష్ ప్రభుత్వ మాజీ అధికారి ఎ.ఒ.హ్యూమ్ — ప్రజలు ఒకచోట చేరి తమ సమస్యలను గురించి చర్చించి, భవిష్యత్తు పట్ల నిర్ణయం తీసుకోవడానికి వీలుగా ఒక సంస్థను స్థాపించడానికి శ్రీకారం చుట్టాడు. దానిఫలితంగానే 1885వ సం॥ లో భారత జాతీయ కాంగ్రెస్ సంస్థ ఆవిర్భవించింది. అదే భారతజాతీయోద్యమాన్ని నడిపింది. బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణగోఖలే, లాలాలజపతిరాయ్, బిపిన్‌చంద్రపాల్ మొదలైన మహానుభావులు ఆ ఉద్యమానికి నాయకులై -- జాతిజనుల ఆలోచనా విధానాన్ని గాఢంగా ప్రభావితం చేశారు. జాతికి మార్గదర్శకులయ్యారు!



# భారత జాతీయోద్యమ వ్యాప్తి

20-వ శతాబ్దారంభంలో భారతదేశం తీవ్ర క్షామానికి గురైంది. జనాభాలో నాలుగోవంతు ప్రజలు కరువు బాధితులయ్యారు. వ్యవసాయ భూములను విస్తృతపరచే అవకాశాలను అధ్యయనం చేయడానికి ఒక కమిషన్ ఏర్పాటు చేయబడింది. వ్యవసాయ బ్యాంకుల స్థాపన కోసం ఒక కమిటీ ఏర్పాటయింది.

భారతీయులకు పాలనా సంస్కరణలు అందని ద్రాక్షపళ్ళే అయినప్పటికీ — కొన్ని సంస్థానాల పాలకులు సంఘసంస్కరణలను అమలు పరిచారు. ఉదాహరణకు — మగపిల్లలకు పదహారేళ్ళు, ఆడపిల్లలకు పన్నెండేళ్ళు వివాహవయోపరిమితిని నిర్ణయిస్తూ — బరోడా గేక్వాడ్ — బాల్యవివాహ నిషేధ చట్టాన్ని ప్రవేశపెట్టాడు.

8వ శతాబ్దంలో పర్షియా నుంచి తరలివచ్చి మనదేశంలో స్థిరపడిన పారశీకులు — దేశప్రజల ఆశలతో, ఆశయాలతో ఒకటిగా కలగలిసిపోయారు. వారిలో పలువురు దేశభక్తులు ఉన్నారు. అలాంటివారిలో మున్నెన్నతగినవాడు జెమ్‌షెడ్ టాటా. భారత దేశాన్ని పారిశ్రామికదేశంగా చూడాలని ఆయన కలలు కన్నాడు. 1901 వ సం॥ లో ప్రప్రథమంగా ఆయన బీహార్‌లోని సక్చీలో ఉక్కుమిల్లు ప్రారంభించాడు. ఆరేళ్ళ తరవాత అది టాటా ఇనుము ఉక్కు కర్మాగారమయింది. ఆ ప్రాంతానికి జెమ్‌షెడ్‌పూర్ అనే సార్థకనామం ఏర్పడింది.



టాటా

కాంగ్రెస్ సమావేశాలలో తరచూ పాల్గొన్న మరొక పార్శీ మహిళ మేడమ్ భికాజీకామా. ఆమె 1902వ సంవత్సరంలో భారతజాతీయోద్యమాన్ని ప్రచానికి చాటే ఆశయంతో ప్రపంచ పర్యటన చేపట్టింది. ఆ పర్యటనా సమయంలోనే — అప్పుడు జర్మనీలోని స్టాట్‌గార్డ్‌లో జరుగుతూన్న ద్వితీయ అంతర్జాతీయ సోషలిస్ట్ కాంగ్రెస్ సమావేశాలలో మేడమ్‌కామా మన త్రివర్ణపతాకాన్ని ఆవిష్కరించింది. ఆ పతాకమే ఉత్తరోత్తరా భారత జాతీయ పతాకం అయింది. ఆ సందర్భంగా పతాకవందనం చేసిన వారిలో రష్యా విప్లవ నాయకుడు లెనిన్ కూడా ఉన్నాడు. మేడమ్ కామాను 'భారత విప్లవమాత'గా పేర్కొంటారు.



కామా

1901వ సం॥ లో ఏడవ ఎడ్వర్డ్ ఇంగ్లాండ్ సింహాసనాన్ని అధిష్ఠించాడు. ఆయన 1903వ సం॥లో మన దేశానికి

వచ్చాడు. ఢిల్లీ గద్దెపై ఆయన భారత చక్రవర్తిగా ప్రకటించబడ్డాడు. కరువు ప్రాంతాల రైతుల రుణాల మీది వడ్డీని ఆయన మాఫీ చేశాడు. బీహార్‌లోని పూసా గ్రామంలో 'ఇంపీరియల్ అగ్రికల్చురల్ రీసెర్చ్ ఇన్స్టిట్యూట్' (వ్యవసాయ పరిశోధనా సంస్థ) స్థాపించబడింది. అదే ఇప్పుడు ఢిల్లీలో వున్న 'ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చర్ రీసెర్చ్.'

- కలకత్తాకు 130 కి.మీ. ఉత్తరంగా ఉన్న బోల్‌పూర్‌లో రవీంద్రనాధటాగూర్ శాంతి నికేతన్ స్థాపించాడు.
- భారతీయ వృక్షశాస్త్రవేత్త జగదీష్ చంద్ర బోస్ — లండన్‌లోని రాయల్ సొసైటీలో ప్రసంగిస్తూ — చెట్లు చేమలకు కూడాప్రాణం వుందనీ అవి భావావేశాలతో, ఉద్రేకాలతో స్పందిస్తాయనీ ప్రకటించాడు.



# బయటి ప్రపంచంలో ....



- అమెరికాలోని ఉత్తర కరోలినాలో — రైట్ సోదరులు తాము రూపొందించిన 'కిట్టీ హాక్' విమానంలో ఆకాశంలో విహరించారు.



- అమెరికాలోని డెట్రాయిట్‌లో హెన్రీఫోర్డ్ అనే ఒక రైతుబిడ్డ మొట్టమొదటి కారులు తయారుచేసే ఫ్యాక్టరీ స్థాపించాడు. అది ఆ దేశంలో పారిశ్రామిక విప్లవానికి దోహదం చేసింది.

# బ్రిటిష్ వ్యతిరేక పవనాలు

అహ్మదాబాదు (1902) లోనూ, మద్రాసు (1903) లోనూ జరిగిన కాంగ్రెస్ వార్షిక సమావేశాలలో 'పారిశ్రామిక ప్రదర్శన' ఒక భాగమయింది.

వ్యవసాయం, పరిశ్రమలు, బ్యాంకులు మొదలైన వాటిలో పనిచేసేవారిని ప్రోత్సహించే ఉద్దేశంతో, వాళ్ళు సహకార సంఘాలు ఏర్పాటు చేసుకునే వీలుకల్పించడానికి 1904వ సం॥ లో భారత సహకార చట్టం అమలులోకి వచ్చింది.

భారతదేశంలో తిరువాన్కూరు సంస్థానం ప్రప్రథమంగా అన్ని వర్గాల పిల్లలకూ ప్రాథమిక ఉచితవిద్యను కల్పించింది.

1905వ సం॥ లో బెంగాల్ విభజన జరిగింది. బెంగాల్‌ను ఢక్కా రాజధానిగా తూర్పు బెంగాల్ ; కలకత్తా రాజధానిగా పశ్చిమ బెంగాల్ అని రెండుగా విభజించారు. పాలనా సౌలభ్యం కోసం ఈ విభజన జరిగినట్టు ప్రభుత్వం వివరణ ఇచ్చింది. కాని ముస్లింలు అధిక సంఖ్యాకులుగా వున్న ప్రాంతాన్ని కలకత్తా నుంచి విడదీయడానికే ఈ పన్నాగమని ప్రజలు భావించారు.

ప్రజల మధ్య నిరసన, బ్రిటిష్ వ్యతిరేక భావాలు ఉధృతమయ్యాయి. సమ్మెలు, బ్రిటిష్ వస్తువుల బహిష్కరణలు జరిగాయి. స్వాతంత్ర్యోద్యమంలో బెంగాల్ అగ్రగామి అయింది!

పూనా, నాగ్‌పూర్, కాన్పూర్, కోయంబత్తూరులలో వ్యవసాయ కళాశాలలు నెలకొల్పి, ప్రభుత్వం వ్యవసాయాభివృద్ధికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చింది.



నౌరోజీ

1906వసం॥లో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ 22 వ సమావేశంలో మొట్టమొదటిసారిగా 'వందేమాతరం' గీతాన్ని ఆలపించారు. ఆ సమావేశానికి దాదాభాయి నౌరోజీ అధ్యక్షత వహించాడు. మహ

మ్మదాలీ జిన్నా సభ్యుడిగా హాజరయ్యాడు.



బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమాన్ని బలోపేతం చేయడానికి అరవింద ఘోష్ 'బందే మాతరం' అనే ఆంగ్ల వార్తాపత్రికను ప్రారంభించాడు.



- కేరళకు చెందిన కీళేరిచీ కున్నికణ్ణన్ భారతదేశంలో మొట్టమొదటి సర్కస్ కంపెనీ అయిన 'మలబార్ గ్రాండ్ సర్కస్'ను స్థాపించాడు.

- మానెక్ డి.సేత్నా 'లైఫ్ ఆఫ్ క్రైస్ట్' (క్రీస్తు జీవితం)ప్రదర్శనతో దేశంలో మొట్ట మొదటి టూరింగ్ సినిమా ప్రారంభించాడు.

# బయటి ప్రపంచంలో ....




- ఐన్‌స్టీన్ సాపేక్షసిద్ధాంతాన్ని ప్రకటించాడు.



- జాన్ స్టీవర్ట్ బ్లాక్టన్ మొట్టమొదటి 'అనిమేటెడ్ కార్టూన్ ఫిల్మ్'ను నిర్మించాడు.

# అతివాదులు - మితవాదులు

1907వ సం॥లో సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో కాంగ్రెస్ నాయకుల మధ్యే చీలిక



ఏర్పడింది. బ్రిటిష్ పాలకులను దేశం నుంచి తరుమగొట్టడానికి తీవ్రచర్యలు చేపట్టాలని అతివాదులు వాదించారు. అలా కాదు; బ్రిటిష్ పాలన కింద వుంటూనే సమాన హక్కులకోసం పోరాడాలని మితవాదులు అభిప్రాయపడ్డారు. అతివాదులు అరవిందఘోష్ అధ్యక్షతన అదే ప్రాంగణంలో విడిగా సమావేశం ఏర్పాటు చేశారు. దానికి బాలగంగాధరతిలక్, బిపిన్ చంద్రపాల్ మద్దతు పలికారు. డాక్టర్ రాష్ బిహారీ బోస్ అధ్యక్షతలో సురేంద్రనాథ్ బెనర్జీ, గోఖలే మద్దతుతో మితవాదులు ప్రత్యేకంగా సమావేశం ఏర్పాటు చేశారు. 1916వ సం॥లో అతివాదులు మళ్ళీ కాంగ్రెస్‌కు తిరిగివచ్చారు.

1908వ సం॥లో జరిగిన అలిపూర్ బాంబు కేసులో, కొందరు అతివాద నాయకులపై ప్రభుత్వం కుట్ర ఆరోపించింది. అరవింద ఘోష్‌ను అదుపులోకి తీసుకుని జైల్లో పెట్టింది. ఆ సంఘటన ఆయన జీవితాన్ని మలుపు తిప్పింది. విజయ సాధనకు పోరాటం కన్నా ఆధ్యాత్మిక పునాదులు కలిగిన 'కర్మ' 'యోగం' ఉత్తమమని ఆయన ప్రకటించాడు. ఒక సంవత్సరం తరవాత జైలు నుంచి విడుదల అయ్యాక ఆయన క్రియాశీల రాజకీయాలనుంచి వైదొలగాడు!

తిలక్ ఖైదును ఖండిస్తూ, బొంబాయిలో 100,000 మంది కార్మికులు ఒక్కసారిగా ఆరు రోజుల పాటు సమ్మెకట్టడంతో — బొంబాయి ప్రప్రథమంగా శ్రామికుల సమ్మెను చూసింది.



కార్మికులు పోలీసులకూ, సైనికులకూ ఎదురు తిరిగారు.

చాలాకాలంగా ఎదురుచూసిన సంస్కరణలను ప్రభుత్వం ప్రవేశపెట్టింది. కొందరు రాజకీయనాయకులకు పూర్తిగా తృప్తి కలిగించలేక పోయినప్పటికీ దీనిని దేశచరిత్రలో ముఖ్యఘట్టమని చెప్పాలి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలలో భారతీయులకు కూడా స్థానం కల్పించాలని నిర్ణయించబడింది. సర్ సత్యేంద్ర ప్రసన్న సిన్హా — వైస్రాయ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో చోటుచేసుకున్న మొట్ట మొదటి భారతీయుడయ్యాడు. స్టేట్ ఎగ్జి క్యూటివ్ కౌన్సిల్‌లో (బెంగాల్) చోటు చేసుకున్న తొలి భారతీయుడు రాజా కిశోర్‌లాల్ గోస్వామి.

దక్షిణ భారత దేశంలోని తూత్తుక్కుడికి చెందిన వ.ఉ.చిదంబరం పిళ్లై మొట్టమొదటి స్వదేశీ నౌకా సంస్థను స్థాపించాడు. ఒక షేర్ పది రూపాయల ప్రకారం అమ్మి, ఆ సొమ్ముతో రెండు ఓడలు అద్దెకు తీసుకుని వ్యాపారం ప్రారంభించాడు. భారతదేశంలో ఆధునిక ఓడ వ్యాపారానికి అది నాంది పలికింది.



# బయటి ప్రపంచంలో ....



- లార్డ్ బాడెన్ పొవెల్ బాయ్‌స్కౌట్‌ను ఆరంభించాడు.

- ఓటు హక్కును కోరుతూ లండన్‌లో 200,000 మంది మహిళలు పెద్ద ఊరేగింపు జరిపారు.

# హిందూ-ముస్లిం ఐక్యతకు పిలుపు

అలిపూర్ బాంబు కేసులో శిక్షించబడిన పదిమంది నిందితులను మొట్టమొదటిసారిగా అండమాన్ దీవులలోని జైలుకు పంపారు. అక్కడి సెల్యులార్ జైలులో వారికి యావజ్జీవకారాగార



శిక్ష విధించబడింది. 1938వ సం॥లో ఆ జైలును మూసివేసేంత వరకు 500 మంది ఖైదీలు అక్కడ శిక్ష అనుభవించారు.

ఉన్నత విద్యాభ్యాసం కోసం ఇంగ్లాండుకు వెళ్ళిన మదన్‌లాల్ ధింగ్రా ఒక ఆంగ్లేయ అధికారిని కాల్చిచంపాడు. అందుకు ఆయనకు మరణశిక్ష విధించారు. ధింగ్రా చర్యను 'నేషనల్ ఇండియన్ అసోసియేషన్' ఖండించింది. అయితే ఆ తీర్మానాన్ని ఒక్క వి.డి. సావర్కార్ మాత్రమే వ్యతిరేకించాడు.

1910వ సం॥ లో అలహాబాదులో సమావేశమైన కాంగ్రెస్ మహాసభకు మళ్ళీ ఒకసారి సర్ విలియం వెడ్డెర్ బ్యారన్ అనే ఆంగ్లేయుడు అధ్యక్షత వహించాడు. ఇంగ్లాండులో చదువుకుంటూన్న భారతీయులతోపాటు, పలువురు ఆంగ్లేయులు కూడా కాంగ్రెస్‌లో సభ్యులుగా ఉండేవారు. అందువల్ల అలాంటి వారి అసంతృప్తిని పోగొట్టడానికీ ; హిందూ- ముస్లింల మధ్య వున్నవిభేదాలనుతొలగించడానికీ;మితవాదులూ, అతివాదుల మధ్యవున్న అంతరాన్ని తగ్గించడానికీ ఆ సమావేశానికి ఒక ఆంగ్లేయుణ్ణి అధ్యక్షుడిగా ఎన్నుకోవడం జరిగింది. భారతీయుల సంక్షేమం కోసం ప్రభుత్వం తీసుకుంటూన్న చర్యలపట్ల సమావేశం తృప్తిని వ్యక్తపరిచింది.

బెంగాల్ విభజన చట్టాన్ని ఉపసంహరించుకోవాలనిసమావేశం కోరింది.

ఆ తీర్మానాన్ని ప్రభుత్వం ఒప్పుకున్నది. ఆ విషయాన్ని — మన దేశ పర్యటనకు వచ్చినఐదవ కింగ్‌జార్జ్‌కి స్వాగతం పలకడానికి ఏర్పాటు చేసిన ఢిల్లీ దర్బారులో ప్రకటించారు. ఆ సందర్భంగానే దేశ రాజధానిని కలకత్తానుంచి ఢిల్లీకి మార్చుతున్నట్టు




కూడా కింగ్‌జార్జ్ ప్రకటించాడు.

1912వ సం॥ లో ఉభయప్రాంతాలు ఒకటయ్యాయి. ఆ ప్రాంతం ఉమ్మడి రాష్ట్రంగానే కొనసాగింది. 1947వ సం॥ లో జరిగిన పాక్ విభజనతో తూర్పు బెంగాల్, తూర్పు పాకిస్తాన్‌గా విడిపోయింది. 1972వ సం॥లో అది ప్రత్యేక

దేశంగా బంగ్లాదేశ్ అయింది.

దేశరాజధాని కలకత్తా నుంచి ఢిల్లీకి మార్చబడింది. జంటనగర నిర్మాణానికి పథకాలు రూపొందాయి.



రవీంద్రనాథ టాగూర్ తాను రచించిన 'జన గణ మన' గీతాన్ని బ్రహ్మ సమాజం వారు ఏర్పాటు చేసిన 'మఘోత్సవం'లో తొలి సారిగా ఆలపించాడు. ఉత్తరోత్తరా అదే జాతీయగీతం అయింది.



- పర్షియాలో చమురు బావులు బయటపడడంతో — ఆంగ్లో-పర్షియన్ ఆయిల్ కంపెనీ ఏర్పాటయింది. పర్షియా (ఇప్పటి ఇరాన్)లో భారతీయులకు ఉద్యోగావకాశాలకు దోహదం చేసింది.

# బయటి ప్రపంచంలో ....

- బెల్జియంకు చెందిన లియోబేక్‌ల్యాండ్ కనుగొని తయారుచేసిన కృత్రిమమైన ప్లాస్టిక్‌తో నూతన ప్లాస్టిక్ యుగం ప్రారంభమయింది. దీనిని పైరెక్స్, సెల్లోఫేన్, సేఫ్టీ గ్లాస్, పాలిస్టర్, టైఫ్లాన్, నైలాన్ తయారు చేయడానికి కూడా ఉపయోగిస్తారు.

- లార్డ్ బేడెన్ పొవెల్ సోదరి యాగ్నీస్ — 'గెర్ల్ గైడ్' ఉద్యమం ఆరంభించింది.

- సముద్రంలో తేలే భవనంగా అభివర్ణించబడిన ఎస్.ఎస్.టైటానిక్ అనే బ్రహ్మాండమైన నౌక 1912 ఏప్రిల్ 14వ తేదీ ఇంగ్లాండులోని సౌతాంప్టన్ నుంచి న్యూయార్క్‌కు బయలుదేరింది. అది సముద్రంలో తేలే ఒక మంచుకొండకు గుద్దుకోవడంతో



అందులోని 2,224 మంది ప్రయాణీకులూ, నౌకాసిబ్బందిలో 1,5 1 3 మందీ మరణించారు.

# సాయుధపోరాటం కోసం

అమెరికాలోని పంజాబు కార్మికులు లాలాహర దయాళ్ నాయకత్వంలో 'గద్దర్' పార్టీ ఏర్పాటు చేశారు. ఆ పార్టీ సిద్ధాంతాలు పంజాబులోని కర్షకులనూ, కార్మికులనూ ఎంతగానో ప్రభావితం చేశాయి. దేశవిముక్తికి సాయుధ పోరాటం ఒక్కటే మార్గమని ఆ పార్టీ బోధించింది. సైన్యంలోని కొందరు పంజాబీ సైనికులకు బ్రిటిష్ అధికారుల పట్ల తీవ్ర వ్యతిరేకత ఉండేది.

1913 వ సం॥ లో రవీంద్రనాధటాగూర్ రచించిన 'గీతాంజలి'కి నోబెల్ బహుమతి లభించింది. ఇది భారత ప్రజల ఆత్మస్థైర్యాన్ని పెంపొందించింది.

పంజాబీల బ్రిటిష్ వ్యతిరేకభావాలకు 'కామ ఘటమారూ' సంఘటన మరింత ఆజ్యంపోసింది. దాదాపు 600 మంది శిక్కులు 1914వ సం॥ లో కెనడాకు బయలుదేరివెళ్ళారు. కాని వాళ్ళు అక్కడ దిగడానికి అనుమతించబడలేదు. కలకత్తాకు తిరిగివచ్చినవారిని, అక్కడే ఉండనిస్తే పోరాటం లేవ దీస్తారన్న అనుమానంతో పంజాబుకు వెళ్ళాలని ప్రభుత్వం ఆదేశించింది. ఎదిరించిన వారిమీద కాల్పులు జరిపింది. పలువురు మరణించారు. చాలామంది జైలుపాలయ్యారు.



ప్రపంచయుద్ధం ప్రారంభం కావడంతో భారతీయ సైనికులు బ్రిటిష్ పక్షం వహించి ఫ్రెంచి, జర్మన్ సరిహద్దు ప్రాంతాల (వెస్టర్న్ ఫ్రంట్)లో యుద్ధం చేశారు.

జర్మన్ యుద్ధనౌక 'ఎమ్డెన్' మద్రాసు హార్బరు మీద బాంబు వేసింది.



# బయటి ప్రపంచంలో ....



- దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులు ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి వెళ్ళ కూడదని నియంత్రించే ప్రభుత్వ ఆనతిని అతిక్రమించినందుకు గాంధీజీ మొట్ట మొదటిసారిగా ఖైదుచేయబడ్డాడు. అంతకు ముందు ఆయన నేటాల్ నుంచి ట్రాన్స్ వాల్‌కు 2,500 మంది భారతీయులను తీసుకువెళ్ళాడు. అటువంటి వాళ్ళనంద రినీ అదుపులోకి తీసుకుని ప్రభుత్వం వాళ్ళను నేటాల్‌కుతిప్పిపంపింది. గాంధీజీకి 9 నెలల జైలుశిక్ష విధించింది.

- 1914వ సం॥ నుంచి కామిక్స్‌లో 'టార్జాన్' రావడం మొద లయింది.



- 1914వ సం॥ జూలై 27వ తేదీ మొదటి ప్రపంచయుద్ధం ఆరంభమయింది. ఆస్ట్రియా యువరాజు ఆర్క్‌డ్యూక్ ఫెర్డినాండ్, ఆయన భార్య 28వ తేదీన సరజీవోలో హత్య చేయ బడ్డారు. ఆస్ట్రియా-హంగరీ వ్యతిరేక చర్య లనుఆపమనిఆస్ట్రియాసెర్బియాను కోరింది. సెర్బియా ఆస్ట్రియా ఇచ్చిన గడువును జూలై 23వ తేదీన తోసిపుచ్చింది.జూలై25వతేదీ సెర్బియామీదఆస్ట్రియాయుద్ధంప్రకటించింది. రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్ మిత్ర పక్షాలు కలిసి 'యాలీస్' ఏర్పడింది. 'యాక్సిస్' దేశాలకు ఆస్ట్రియా-హంగరీ,జర్మనీ దేశాలు నాయకత్వం వహించాయి. ఆ తరవాత వాటితో ఇటలీ, గ్రీసు,రుమేనియా, పోర్చుగల్, బెల్జియం, నెదర్లాండ్, జపాను దేశాలు కలిశాయి. యుద్ధం చాలావరకు జర్మనీ, ఆస్ట్రియా దేశాల పశ్చిమ, తూర్పు తీరాలలోనే జరిగింది.

- ఉత్తర, దక్షిణ అమెరికాలను వేరుచేసే పనామా కాలువగుండా మొట్టమొదటిసారిగా ఓడలు నడిచాయి.

- న్యూయార్క్‌లో ఆకాశాన్నంటే — వూల్‌వర్త్ బిల్డింగ్ నిర్మాణంతో ఎత్తయినభవనాలు నిర్మించడంలో నూతన సాంకేతిక పద్ధతులు ప్రాచుర్యంలోకి వచ్చాయి.



# పొరుగు గడ్డపై భారతప్రభుత్వం!



1915సం॥లో గాంధీజీ స్వదేశాగమనంతోజాతీయోద్యమం మరింతవేగం పుంజుకున్నది. గోఖలేమార్గాన్ని అనుసరించనున్నట్టు ఆయన ప్రకటించాడు. దక్షిణఆఫ్రికా 'ఫీనిక్స్ ఆశ్రమం'లోని తన అనుచరులతో కలిసి గాంధీజీ, శాంతిని కేతన్‌లోని టాగూరును కలిశాడు. టాగూర్‌కు 'సర్' బిరుద ప్రదానం జరిగింది.

కాబూల్‌లో స్వతంత్రభారతప్రభుత్వాన్ని ఏర్పాటుచేసినట్టు రాజా మహేంద్ర ప్రతాప్, బర్కతుల్లా ప్రకటించారు.

దివ్యజ్ఞాన సమాజం అధ్యక్షురాలు డా.అనీ బిసెంట్ 1916వ సం॥ లో 'హోమ్‌రూల్ ఉద్యమం' ప్రారంభించారు. భారతీయుల రాజకీయ అభిలాషలను సంఘటిత పరచి -- స్థానిక స్వపరిపాలన అవసరాన్ని బ్రిటిష్ పార్లమెంటుకు తెలియజేయడమే ఆమె లక్ష్యం. హోమ్‌రూల్ లీగ్ ఏర్పాటయింది. అయితే అలాంటి ప్రత్యేకసంస్థ అవసరం లేదని గోఖలేలాంటి నాయకులు భావించారు. అయినప్పటికీ తిలక్ లాంటి నాయకులు 'లీగ్'లో చేరడంవల్ల దానిపట్ల ప్రజలలో ప్రత్యేక ఉత్సాహాన్ని రేకెత్తించింది.

ప్రొఫెసర్ కార్వే పూనాలో ప్రప్రథమంగా మహిళావిశ్వవిద్యాలయం (1936లో బొంబాయికి మార్చబడింది) స్థాపించడంతో స్త్రీ విద్యావ్యాప్తికి ప్రోత్సాహంలభించింది. ఢిల్లీలో 'లేడీ హార్డింగ్ కాలేజ్' అనే ప్రత్యేక మహిళావైద్యకళాశాల స్థాపించబడింది. 1917వ సం॥ కలకత్తాలో సమావేశమైన 32వ కాంగ్రెస్ మహాసభకు డా. అనీబిసెంట్ అధ్యక్షత వహించారు.దాంతో ఆమె స్థాపించిన హోమ్‌రూల్ ఉద్యమానికి అంగీకారం లభించినట్టయింది.



డా. అనీబిసెంట్



ప్రొ.కార్వే

అధికారాన్ని అంచెలవారీగా బాధ్యతాయుతమైన ప్రభు

త్వానికి అప్పగిస్తామని తెలియజేసే మాంటేగ్-చేమ్స్‌ఫర్డ్ సంస్కరణలు వచ్చాయి.

బీహారులోని చంపారన్‌లో, అనుచరులతో కలిసి సత్యాగ్రహం చేయడానికి వెళుతూండగా గాంధీజీని బ్రిటిష్ ప్రభుత్వం భారత భూమిపై మొట్టమొదటిసారిగా ఖైదుచేసింది. ఈ చర్య జాతీయోద్యమాన్ని ఒక్క కుదుపు కుదిపింది. బ్రిటిష్ ఎస్టేట్స్‌లో ఒప్పందం మీద కూలీలుగా పనిచేస్తూన్న రైతులు కూడా ఉద్యమంలో చేరారు.

ప్రపంచయుద్ధానంతరం 1918వసం॥లో టర్కీని రెండుగా విభజించడానికి బ్రిటిష్ ప్రభుత్వం ప్రయత్నించింది. దీనిని వ్యతిరేకిస్తూ మహమ్మద్,షౌకత్‌అనేఅలీసోదరులు ఖిలాఫత్ ఉద్యమాన్ని లేవదీశారు. అది బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమం కావడంవల్ల భారతదేశంలో తన ప్రభావం చూపింది. భారతీయ నాయకుల గౌరవాదరాలకు అలీసోదరులు పాత్రులయ్యారు.

డబ్ల్యు.పి. వాడియా ప్రప్రథమంగా మద్రాసులో ట్రేడ్ యూనియన్‌ను ఏర్పరచాడు. ఆ తరవాత గాంధీజీ అహమ్మదాబాద్ టెక్స్‌టైల్ కార్మిక యూనియన్‌ను స్థాపించాడు.

## బయటి ప్రపంచంలో ....



- 1915లోభూమిమీదా,సముద్రంలో యుద్ధాలు జరిగాయి. పశ్చిమ ప్రాంతంలో మిత్రపక్షాలు విజయాలు సాధించాయి. తూర్పు ప్రాంతంలో రష్యా వెనకడుగు వేయవలసివచ్చింది. బ్రిటిష్ నౌక లూసిటానియా, జర్మన్ యూబోట్ బాంబులదాడికి 1200మంది ప్రయాణీకులతోనీటమునిగింది. అందులో 126మంది అమెరికా దేశస్థులుకూడాఉన్నారు.అమెరికాకూడా యుద్ధంలో చేరాలని ఒత్తిడి వచ్చింది. అయినా ప్రెసిడెంట్ ఉడ్రోవిల్సన్ తన తటస్థ వైఖరిని వదిలిపెట్టలేదు.
- మొట్టమొదటిసారిగా జర్మనీ బాష్పవాయువును ఆయుధంగా ఉపయోగించింది.
- 1917అక్టోబర్‌విప్లవంద్వారారష్యాలో 300సంవత్సరాల జార్ వంశస్థుల పరిపాలన అంతమై కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడింది. ప్రపంచంలో ప్రప్రథమంగా కార్మికవర్గం పాలకవర్గంగా పరిణమించింది. లియొన్‌ట్రాట్‌స్కీ వ్లాడిమిర్ లెనిన్ నాయకత్వంలో జరిగిన విప్లవంలో ఫ్యాక్టరీ కార్మికులు, రైతులు, సైనికులు నౌకాదళ సిబ్బంది పాల్గొన్నారు.


లెనిన్

# సహాయ నిరాకరణోద్యమం

1919 జలియన్‌వాలాబాగ్ దురంతాల తరవాత బ్రిటిష్ వ్యతిరేకోద్యమం మహా అగ్నిలా రగులుకున్నది. రాజద్రోహనేరం ఆరోపించబడిన ఎవరినైనా సరే విచారణ లేకుండానే ఖైదు చేసి, శిక్షించే అధికారం అధికారులకు ఉన్నది అన్న రౌలట్ చట్టం అమలులోకి వచ్చింది. దానిని వ్యతిరేకిస్తూ దాదాపు 25,000 మంది ప్రజలు జలియన్‌వాలా బాగ్‌లో గుమిగూడారు. ఎటువంటి హెచ్చరిక చేయకుండా విచక్షణా రహితంగా సైనికులు వాళ్ళమీద కాల్పులు జరిపి నానాబీభత్సం సృష్టించారు. 380 మంది మరణించారు. 1200 మంది గాయపడ్డారు. దాంతో ప్రజల ఆగ్రహావేశాలు కట్టలు తెంచుకున్నాయి. ఆ విధంగా జలియన్‌వాలాబాగ్ స్వాతంత్రోద్యమ చరిత్రలో ఒక మైలురాయిగా నిలిచింది. బ్రిటిష్ పార్లమెంట్‌లో లిబరల్ పార్టీ సభ్యులు ఆ సంఘటనపట్ల తీవ్ర దిగ్భ్రాంతిని వ్యక్తం చేశారు. ప్రభుత్వ అణచివేత చర్యను ఖండిస్తూ దేశవ్యాప్తంగా నిరసన సభలు జరిగాయి. రవీంద్రనాథటాగూర్ బ్రిటిష్ ప్రభుత్వానికి తన నిరసనను తెలియజేస్తూ 'సర్' బిరుదును తిప్పిఇచ్చేశాడు.



ఖిలాఫత్ ఉద్యమం ఊపు అందుకున్నది. ప్రభుత్వంతో సహాయ నిరాకరణను ఖిలాఫత్ ప్రతిపాదించింది. దానిని స్వాతంత్ర్య సాధనకు ఒక వ్యూహంగా 1920 కలకత్తా కాంగ్రెస్ సమావేశం అంగీకరించింది. ఆ సంవత్సరమే నాగ్‌పూర్ కాంగ్రెస్ సమావేశంలోమరొకసారి 'స్వరాజ్యం' కోసం తీర్మానం చేయబడింది. సహాయనిరాకరణోద్యమానికినాయకత్వంవహించి నడిపించ వలసిందిగా గాంధీజీని కోరారు.

లాలాలజపతిరాయ్ అధ్యక్షతలో నాగ్‌పూర్‌లో జరిగిన అఖిలభారత కళాశాల విద్యార్థుల మహాసభ - విద్యార్థి సంఘాన్ని స్థాపించాలని నిర్ణయించింది.

స్వదేశ సంస్థానాల స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తూ, ఇకపై అన్ని ప్రభుత్వ సమావేశాలకూ స్వతంత్ర సంస్థానాలుగా అవి హాజరుకావచ్చునని బట్లర్ కమిటీ నివేదిక ఆమోదించింది.

# బయటి ప్రపంచంలో ....



- బ్రిటన్, అమెరికా, ఫ్రాన్స్, కెనడా, ఆస్ట్రేలియా సంయుక్తపోరాటం కారణంగా జర్మనీ తిరోగమించి, లొంగిపోయి 'ప్యారీస్‌సంధి' ఒప్పందంలో సంతకం చేయవలసివచ్చింది. పలుప్రాంతాలు కోల్పోయి రష్యా యుద్ధం నుంచిఉపసంహరించుకోవడంవల్ల మొదటి ప్రపంచ యుద్ధం అంతమయింది.
- బ్రిటన్, మహిళలకుఓటింగ్‌హక్కుఇచ్చింది. పురుషుల ఓటువేసే వయోపరిమితిని 21 సంవత్సరాలకు తగ్గించింది.
- 1918 జూన్ 28వతేదీ 'వెర్సాలిస్ సంధి' పత్రంలో సంతకాలు జరగడంతో మొదటి ప్రపంచయుద్ధం ముగిసింది.
- ప్యారీస్‌లో 'లీగ్ ఆఫ్ నేషన్స్' ప్రథమ సమావేశం పారీస్‌లో జరిగింది. అమెరికా ప్రెసిడెంట్ వుడ్రో విల్సన్ సమావేశానికి అధ్యక్షత వహించాడు.



- నవంబర్19వతేదీ27మందిసభ్యులతో జెనీవాలో లీగ్ ఆఫ్ నేషన్స్ ప్రథమ సాధికారిక సమావేశం జరిగింది. వుడ్రోవిల్సన్ 14 సూత్రాలు అంగీకరించబడ్డాయి. మరొక యుద్ధాన్ని నివారించేందుకు రెండు దేశాల మధ్య విభేదాలను చర్చల ద్వారా పరిష్కరించుకోవాలి అని చివరి సూత్రం పేర్కొన్నది.

# స్వాతంత్ర్యోద్యమంలో విద్యార్థులు

భారతస్వాతంత్రోద్యమ చరిత్రలో 1921 జనవరి 12వ తేదీ ఒక ప్రధానమైన రోజు. లార్డ్ కొన్నాట్ మద్రాసులో మొదటి లెజిస్లేటివ్ కౌన్సిల్‌ను ప్రారంభించాడు. కాంగ్రెస్ వారిలో మితవాదులు మాత్రమే ఆ కార్యక్రమానికి హాజరయ్యారు. లార్డ్ కొన్నాట్ రాకకు వ్యతిరేకంగా ప్రదర్శనలు జరిగాయి. కొన్నాళ్ళ తరవాత అదే సంవత్సరం వేల్స్ యువరాజు భారత పర్యటనకు వచ్చినప్పుడు ప్రజాభిప్రాయం మరింత స్పష్టంగా వెల్లడయింది. అతడు వెళ్ళిన చోటల్లా నల్ల జెండాల ప్రదర్శనలు జరిగాయి.



సి.ఆర్. దాస్



మోతిలాల్ నెహ్రూ



రాజగోపాలాచారి

సహాయ నిరాకరణోద్యమాన్ని కొనసాగించాలని అహ్మదాబాదు కాంగ్రెస్ సమావేశంలో నిర్ణయించబడింది. పంజాబులోని గుజ్రన్‌వాలాలో జరిగిన విద్యార్థుల మహాసభలో — విద్యార్థులు కళాశాలలు, విశ్వవిద్యాలయాలు బహిష్కరించి స్వాతంత్ర్యోద్యమంలో పాలుపంచుకోవాలని పిలుపునిచ్చింది.

1922 వ సం॥ లో గోరఖ్‌పూర్ జిల్లా చౌరీ చౌరా గ్రామంలో 2,000 మంది కాంగ్రెస్ కార్యకర్తలు, రైతులు ఒక ప్రదర్శన జరిపారు. గుంపును చెల్లాచెదురు చేయడానికి పోలీసులు కాల్పులు జరపడంతో అది హింసాత్మకంగా మారింది. ప్రజలు పోలీస్ స్టేషన్‌పై దాడిచేసి 22 పోలీసులను చంపారు. ఒక వారం తరవాత జరిగిన కాంగ్రెస్ కార్యవర్గ కమిటీ సమావేశంలో, గాంధీజీ కోరిక మేరకు సహాయనిరాకరణోద్యమాన్ని ఆపాలని నిర్ణయించారు.

కాంగ్రెస్ పార్టీలో చీలిక వచ్చి, చిత్తరంజన్ దాస్ - మోతిలాల్ నెహ్రూ నాయకత్వంలో స్వరాజ్ పార్టీ ఏర్పడింది. భారతీయులు లెజిస్లేటివ్ కౌన్సిల్స్‌లో ప్రవేశించాలి ; ప్రభుత్వంలో సహాయనిరాకరణోద్యమాన్ని కొనసాగించాలి అని వారు గయ సమావేశంలో ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సి.రాజగోపాలాచారి బృందం వ్యతిరేకించింది.

• టాగూరు స్థాపించిన శాంతినికేతన్ — భాషలు, మతాలు, సాహిత్యం, సంగీతం, లలితకళలుమొదలైన వాటిని అధ్యయనంచేసే ప్రపంచప్రసిద్ధిగాంచిన 'విశ్వభారతి విశ్వవిద్యాలయం'గా రూపొందింది.

[వచ్చే సంచికలో : భారత రిపబ్లిక్ అవతరణ]



# రాజమార్గం

చుట్టుపక్కల దేశాలతో పోల్చితే, చంపక దేశం బాగా వెనుకబడివున్నది. రాజు ప్రచండ సేనుడు, అందుకు కారణాలేమిటో తెలుసుకురమ్మని, యువరాజు వివేకసేనుణ్ణి అభివృద్ధి చెందిన దేశాలకు పంపాడు. అక్కడ ప్రజలు సాధించిన అభివృద్ధి చూసిన వివేకుడికి కళ్ళు చెదిరిపోయాయి. తన దేశం కూడా ఆ స్థాయికి చేరుకోవాలని ఆశపడ్డాడు. అక్కడి వివరాలు తెలుసుకునేలోగా ప్రచండ సేనుడు హఠాన్మరణం చెందినట్లు వార్త వచ్చింది. వెంటనే వివేకసేనుడు రాజ్యానికి తిరిగి వెళ్ళాడు. ఇరవై ఏళ్ళ వయసులోనే దేశానికి రాజయ్యాడు.

వివేకుడి మనసులో ఎన్నో అభివృద్ధి పథకాలున్నాయి. కానీ ఖజానాలో డబ్బు చాలదు కాబట్టి వాటిని అమలుపరచడం సాధ్యం కాదు. కొత్తగా పన్నులు వేద్దామనుకుంటే, అప్పటికే పన్నుల భారం ఎక్కువైందని ప్రజలు ఘోషిస్తున్నారు. చంపక దేశంలో జీవనదులు చాలా వున్నాయి. నీటి ఎద్దడి లేకపోవడం వల్ల పంటలు పుష్కలంగా పండుతాయి. అలాంటప్పుడు దేశం ఎందుకు అభివృద్ధి చెందడం లేదో, వివేకుడికి అర్థం కాలేదు. ఈ రహస్యం ఛేదించడానికి ప్రజలే సమర్థులని భావించి, అతడు కొంతకాలం పాటు మారువేషంలో దేశ సంచారం చేశాడు.

దేశసంచారంలో వివేకుడు ఒకసారి, ఒక చెట్టు కింద నిద్రపోతున్న యువకుణ్ణి చూసి తట్టి లేపి, ''పట్టపగలు నిద్రపోతున్నావు. నీకు వేరే పనిలేదా?'' అని అడిగాడు.

''పనిచేయవలసిన అవసరం నాకేమున్నది? ఎప్పుడడిగినా తిండిపెట్టే పుణ్యాత్ములు, ఊరి నిండావున్నారు,'' అన్నాడా యువకుడు.

ఆ జవాబుకు ఆశ్చర్యపడిన వివేకుడు, ''అలాగా! నీకు తిండి పెడుతున్న వారిలో ఒక్కడి పేరు చెప్పు. నేనూ వెళ్ళి ఆకలి తీర్చుకుంటాను,'' అన్నాడు.

ఆ యువకుడు, గ్రామాధికారి గౌరాంగుడి పేరు చెప్పాడు. గౌరాంగుడి ఇంటికి

''వసుంధర''

వెళ్ళిన వివేకుడికి చక్కని ఆదరణ లభించింది. అతడక్కడ సుఖంగా భోజనం చేసి, "తిన్న ఇంటి వాసాలు లెక్కపెడుతున్నాననుకోవద్దు. మీ దానధర్మాలు, దేశంలో సోమరిపోతుల సంఖ్యను పెంచుతున్నాయని, మీకెప్పుడూ అనిపించలేదా?" అన్నాడు.

అందుకు గౌరాంగుడు ఒక క్షణం ఆగి, "తెలుసు. కానీ ఏం చేసేది? అవసరానికి మించిన పంటలు పండుతున్నాయి. వాటిని వృధా చెయ్యలేం కదా!" అన్నాడు.

"మన పంటలను కొనేందుకు ఎన్నో దేశాలు సిద్ధంగా వున్నాయి. మీరు పంటలను అమ్మితే మనదేశానికి ఆదాయం పెరుగుతుంది కదా!" అన్నాడు వివేకుడు.

గ్రామాధికారి నవ్వి, "మన దేశంలో సరైన బాటలు లేవు. అందుచేత పంటలను మరొక చోటకు రవాణా చేసే సౌకర్యాలు శూన్యం. ఒక ఊరునుంచి మరొక ఊరుకు ప్రయాణం చేయడమే ఎంతో కష్టమనిపించి ప్రజలు కూపస్థమండూకాలై, ప్రపంచజ్ఞాన శూన్యులవుతున్నారు. యువకులు సోమరులవుతున్నారని నువ్వంటున్నావు. కానీ ఇప్పటికే పంటలు ఎక్కువైనందున ఉత్పత్తి తగ్గించాలని నేననుకుంటున్నాను. మన దేశంలోని పంటలను మరెక్కడో అమ్మడం కలలోని మాట!" అన్నాడు.

"మీరింకా ఉత్పత్తిని పెంచి, సోమరి యువకుల్ని పురికొల్పి, చుట్టుపక్కల రాజమార్గాలు వేయించవచ్చును కదా!" అన్నాడు వివేకుడు.





గ్రామాధికారి కలవరపడుతూ, "అమ్మో! అది రాజువల్లనే తప్పు, మావల్ల కాదు. నేను గ్రామాధికారిని. చిన్న పనులు మాత్రమే చేయగలను," అన్నాడు.

"అయితేతప్పంతా మీరాజుది!" అంటూ వివేకుడు, రాజును దుర్భాషలాడాడు.

గ్రామాధికారి కళ్ళు ఎర్రబడ్డాయి. ఆయన వివేకుడి వంక కోపంగా చూసి, "పరదేశి విలా వున్నావు కాబట్టి హెచ్చరిస్తున్నాను. మా దేశంలో మా రాజంటే ప్రజలకు అంతు లేని గౌరవం. ఆయన్ను పల్లెత్తుమాటన్నా వంటే, నీప్రాణాలు దక్కవు!" అన్నాడు.

ఈ మాటలకు వివేకుడు మనసులో ఎంతో సంతోషించాడు. అతడికి దేశసంచా రంలో కొత్తగా తెలుసుకోవలసిన విషయా లేమీ కనిపించలేదు. ఆ పల్లెగ్రామంనుంచి ఎంతో కష్టపడి కొన్ని రోజులు ప్రయాణం చేసి రాజధానికి చేరుకున్నాడు.

మర్నాడు వివేకుడు మంత్రులను సమా వేశపరిచి, "మనదేశపు దౌర్భాగ్యానికి నాకు కారణం తెలిసింది. అయితే, అందుకు ఏం చేయాలో తెలియని అసహాయస్థితిలో వున్నాను," అంటూ తన దేశాటన అను భవాలు చెప్పాడు.

"ప్రభూ! ఎవరి కర్మకు ఎవరు కర్తలు? తమరు అనవసరంగా విచారపడకండి. మన రాజధానీ నగరంలో చంద్రభానుడనే మహాకవి వున్నాడు. ఆయనతో కవితా గోష్ఠి చేస్తే, మీకు మనోల్లాసం కలుగుతుంది," అన్నాడొక వృద్ధమంత్రి.

"మీరనే ఆ చంద్రభానుడి విషయం నాకు తెలియదు. కానీ శివపురం అనే గ్రామంలో, వసునాథుడనే కవిని చూశాను. ఆయన నాకెంతో నచ్చాడు. నేను స్వయంగా వెళ్ళి, ఆయనను సన్మానించాలనుకుంటు న్నాను. ఎందుకంటే, కవులను పిలిచి కాక

వారివద్దకే వెళ్ళి సన్మానించాలన్నది, నా అభిమతం. ఈ విషయాన్ని వెంటనే చాటింపు వేయించండి. సరిగ్గా మూడు మాసాల అనంతరం వచ్చే సంక్రాంతినాడే, ఆ సన్మానానికి ముహూర్తం,'' అన్నాడు వివేకుడు.

వెంటనే ఆ విధంగా రాజ్యమంతటా చాటింపు వేయబడింది. అది విన్న ఎందరికో కవి వసునాధుడిని గురించి కుతూహలం కలిగింది. మహాకవులెందరో వెళ్ళి వసునాధుణ్ణి దర్శించి, రాజుకాయనలో కనబడిన ప్రత్యేక విశేషమేమిటో అర్థం కాక తికమకపడ్డారు. ఈలోగా శివపురంలో రాజు వివేకుడికి స్వాగతం పలకడానికి సన్నాహాలు ప్రారంభమయ్యాయి.

అన్నప్రకారం వివేకుడు, తాను చెప్పిన సంక్రాంతికి శివపురం బయల్దేరి వెళ్ళాడు. ఆయన ఎక్కిన జోడుగుర్రాల రథం నున్నటి రాజమార్గంపై ప్రయాణం ప్రారంభించింది. ఆ రాజమార్గం శివపురం దాకా కొనసాగింది.

వివేకుడు శివపురం చేరుకున్నాక, కవి వసునాధుడితో, ''అయ్యా! మీరేపాటి కవులో నాకు తెలియదు. కానీ మిమ్మల్ని సన్మానించాలనుకోగానే శివపురానికీ, రాజధానికీ చక్కని రాజమార్గం ఏర్పడింది. మన ప్రజలు రాజు సాయం లేకుండా, తమకు తామే రాజమార్గాలు వేయగలమని నిరూపించారు. ఈ ఆదర్శాన్ని మిగిలిన గ్రామాలన్నీ కూడా పాటించగలవని ఆశిస్తూ, అందుకు దోహదం చేస్తున్న మీకు, ఈ కానుకలిస్తున్నాను!'' అంటూ సన్మానించాడు.

ఆ తర్వాత శివపురం ఉన్నట్లుండి ఎంతో అభ్యున్నతిని సాధించసాగింది. రాజమార్గాలు రాజుకు స్వాగతం పలకడానికే కాదనీ, వాటి వల్ల ప్రజలకే ఎక్కువ ప్రయోజనమనీ, ఎవరికివారే ఆ పనిచేయగలరనీ అర్థమైనాక, చంపకదేశంలో రాజుయత్నం లేకుండానే, రాజమార్గాలు ఏర్పడ్డాయి. అయితే, వాటి అసలు ప్రయోజనం తెలియడం వల్ల, అక్కడ వాటిని రాజమార్గాలనడం మానేసి ప్రజామార్గాలు, రవాణా మార్గాలు అనడం ప్రారంభించారు. కొన్నిదేశాల్లో, చక్కటి బాటలకు ఇంకా రాజమార్గమనే పేరే వాడుకలోవుంది.



60. చార్వాక వధ

# మహాభారతం

యుద్ధం అయిపోయిన తరవాత పాండవులు గంగా తీరాన చచ్చిపోయిన బంధువులకు తిలోదకాలూ; దశదానాలూ మొదలయినవి చేసి, ఒకనెల రోజులు మైలపట్టి, ధృతరాష్ట్రుడితోనూ, విదురుడితోనూ, స్త్రీజనంతోనూనగరం వెలుపల ఒకపర్ణశాలలో నివసించారు.

తరవాత ధర్మరాజును చూడటానికి వ్యాసుడు మొదలైన మునులూ, వారి శిష్యులూ, బ్రాహ్మణులూ, గృహస్థులూ వచ్చారు.

ధర్మరాజు వారితో, ''కృష్ణుడూ, భీమార్జునులూ నాకు విజయం కలిగించారు. కాని నాకు ఇది విజయంగా తోచటం లేదు. జ్ఞాతులను చంపుకున్నాను. అభిమన్యుణ్ణీ, ద్రౌపది కొడుకులనూ పోగొట్టుకున్నాను. నాకు ఈ రాజ్యభోగం ఏమి రుచిస్తుంది? ఇది ఇలా ఉండగా, మహాదాతా, మహావీరుడూ అయిన కర్ణుడు మాకు అన్న అని మా తల్లి ఆఖరున తిలోదకాలప్పుడు బయటపెట్టింది. అయినా, అలాటి మహారథుడు ఎందుకు చచ్చాడో తెలియరాదు,'' అన్నాడు.

అది విని నారదుడు కర్ణుడికి గల శాపాలను గురించి ధర్మరాజుకు వివరంగా తెలిపాడు :

కర్ణుడు ద్రోణుడి దగ్గిర విద్య నేర్చుకునేటప్పుడు అర్జునుడి విలువిద్యను చూసి





అసూయపడేవాడు. అలాగే అతనికి ధర్మరాజు తెలివితేటలూ, భీముడి బాహుబలమూ, నకుల సహదేవుల సౌజన్యమూ, కృష్ణార్జునుల మధ్య స్నేహమూ చూసి అసూయగా ఉండేది. ఆ కారణంచేతనే అతను మెల్లగా దుర్యోధనుడి స్నేహం సంపాదించాడు.

ద్రోణుడికి శిష్యుడుగా ఉంటూ కర్ణుడు ఒకనాడు రహస్యంగా ద్రోణుడి వద్దకు వెళ్ళి, "గురువర్యా, మీకు శిష్యుల పట్ల పక్షపాత బుద్ధి లేదు గదా, యుద్ధంలో ఎలాగైనా అర్జునుణ్ణి జయించాలని నాకు తీవ్రమైన కోరిక ఉన్నది. నాకు బ్రహ్మాస్త్రం ప్రయోగ ఉపసంహారాలతో ఉపదేశించండి," అని కోరాడు.

ద్రోణుడు అర్జున పక్షపాతి. అందుచేత కర్ణుడితో, "నువ్వు సూతుడి కొడుకువు. బ్రాహ్మణులకూ, క్షత్రియులకూ తప్ప బ్రహ్మాస్త్రం ఇవ్వరాదు. అందువల్ల నేను నువ్వు కోరినట్టు నీకు బ్రహ్మాస్త్రాన్ని ఉపదేశించలేను," అన్నాడు.

ఈ మాట విని కర్ణుడు, మహేంద్రగిరి సమీపంలో తపస్సు చేసుకుంటున్న పరశురాముడి వద్దకు వెళ్ళి, సాష్టాంగవందనం చేసి, "మహాత్మా, నేను భృగువంశానికి చెందిన బ్రాహ్మణ్ణి. నన్ను నీ శిష్యుడుగా స్వీకరించు," అన్నాడు.

పరశురాముడు అందుకు సమ్మతించాడు. పరశురాముడు అతనికి అనేక శస్త్రాలూ, అస్త్రాలూ ఎలా ప్రయోగించాలో, ఎలా ఉపసంహరించాలో తెలిపాడు.

ఇలా ఉండగా ఒకనాడు కర్ణుడు తన ధనుర్బాణాలతో తన గురువు ఆశ్రమానికి సమీపంగా సముద్ర తీరాన తిరుగుతూ ఒక ఆవును చూసి, దాన్ని బాణంతో కొట్టిచంపాడు. అది ఒక బ్రాహ్మణుడి హోమధేనువని అతనికి తెలిసింది. ఆ తరవాత వెంటనే కర్ణుడు పశ్చాత్తాపంతో వెళ్ళి ఆ బ్రాహ్మణుడికి క్షమాపణ చెప్పుకున్నాడు. కాని ఆ బ్రాహ్మణుడు శాంతించక, "యుద్ధంలో నీ రథచక్రం భూమిలో కుంగిపోయి, శత్రువు చేత దెబ్బ తిని, నా ఆవు చచ్చినట్టు చావు," అని ఘోర శాపం పెట్టాడు.

కర్ణుడు పరశురాముణ్ణి తన నిరంతర సేవలతోనూ, విద్యాకౌశలంతోనూ మెప్పించి, ఆయన వద్ద ధనుర్వేదమంతా నేర్చుకుని, బ్రహ్మాస్త్రం ఉపదేశం పొందాడు. కాని ఒకనాడు ఒక వింత జరిగింది. పరశురాముడు కర్ణుడి తొడమీద తల పెట్టుకుని నిద్రపోతున్నాడు. ఇంతలో ఏదో కీటకం కర్ణుడి తొడను తొలచసాగింది. కర్ణుడు బలవంతాన బాధ



సహించుకుని, గురువుకు నిద్రాభంగం కలగకుండా ఉండగలందులకు ఏమాత్రం కదలకుండా నిశ్చలంగా కూర్చున్నాడు. అతని రక్తం కాలువలు కట్టింది.

తరవాత పరశురాముడు లేచి, రక్తం చూసి, కర్ణుడి తొడను కొరుకుతున్న పురుగును కళ్ళారా చూసిన మీదట, ''ఓరీ, బ్రాహ్మణుడికి ఇంత సహనం ఉండదు. నువ్వు నిజంగా ఎవరు?'' అని అడిగాడు పట్టరాని కోపంతో.

నిజం చెప్పకపోతే పరశురాముడు శపిస్తాడని భయపడి కర్ణుడు తాను సూతకులం వాణ్ణని చెప్పాడు. తనవద్ద నేర్చుకున్న బ్రహ్మాస్త్రం కర్ణుడికి యుద్ధంలో స్ఫురించకుండా పరశురాముడు శాపం పెట్టాడు.

ఇన్ని శాపాలకు గురిఅయి కూడా కర్ణుడు పలుమార్లు గొప్ప యోధుడనిపించుకున్నాడు.

కళింగదేశంలోని రాజపురానికి రాజైన చిత్రాంగదుడి కుమార్తెకు స్వయంవరం జరిగినప్పుడు, దుర్యోధనుడు ఆమెను బలాత్కారంగా ఎత్తుకుపోతూంటే, మిగిలిన రాజులు అతనిపై యుద్ధానికి వచ్చారు. అప్పుడు కర్ణుడు అతనికి అండగా నిలబడి విజయం చేకూర్చిపెట్టాడు.

మరొకసారి కర్ణుడు ఎవరికీ జయించరాని జరాసంధుణ్ణే జయించి, అతని నుంచి మాలిని అనే గొప్ప నగరాన్ని కానుకగా పుచ్చుకున్నాడు. అతని పరాక్రమంచూసి ఇంద్రుడు అర్జునుడి క్షేమం కోసం అతని కవచకుండలాలు పట్టుకుపోయాడు. కర్ణుడు యుద్ధంలో చావడానికి ఇవన్నీ తోడ్పడ్డాయి.

నారదుడి నుంచి కర్ణుడి విషయాలు ఈ విధంగా తెలుసుకుని, యుద్ధంలో చచ్చిన వారినందరినీ తలుచుకుని ధర్మరాజు, ''పిల్లలకోసం తల్లిదండ్రులు పడరాని పాట్లు పడతారు. వాళ్ళు భోగాలు అనుభవించడం కోసమే గదా తల్లులు తొమ్మిది నెలలు మోసి, ప్రసవవేదన అనుభవిస్తారు! భోగాలు అనుభవించకుండా ఎంతమంది యువకులు ఈ యుద్ధంలో దుర్మరణం పొందారు! ఛీ, క్షత్రియ ధర్మం! రాజ్యం కోసం ఎంత పాపానికి ఒడిగట్టాను! నాకీ రాజ్యం అక్కర్లేదు. అర్జునా, దీన్ని నువ్వే ఏలుకో. నేను తీర్థయాత్రలు చేస్తాను,'' అన్నాడు.

ఈమాటలో అర్జునుడికి ఏదో అవమానం తోచి, కొంచెం కోపం కూడా వచ్చింది. అతను ధర్మరాజుతో, ''అన్నా, మనం మన రాజ్యం తిరిగి సంపాదించుకునేటందుకు క్షత్రియ ధర్మాన్ని అవలంబించాం. తీరా రాజ్యం వచ్చాక

బిచ్చం ఎత్తుకుంటాననటం అసందర్భంగా ఉన్నది. బిచ్చమే ఎత్తుకోదలిస్తే ఇంత మందిని ఎందుకు చావనిచ్చినట్టు? ఇప్పుడు నువ్వు బిచ్చమెత్తుతానంటే అందరూ నిన్ను చూసి నవ్వరా? దారిద్ర్యం కోరదగినది కాదని నహుషుడు చెప్పాడు. అన్ని ధర్మాలకూ మూలం ధనమే కదా! అందుచేత రాజ్యం స్వీకరించు. అశ్వమేధయాగం చేసి, అన్ని పాపాలూ పోగొట్టుకో,'' అని చెప్పాడు.

భీముడు అర్జునుడికి తోడై, ''రాజధర్మాన్ని తిట్టటంలో అర్థమేమిటి? శత్రువులను చంపటంలో దయ ఏమిటి? హింస ఏమిటి? పని పెట్టుకుని దుర్యోధనుడు మొదలైన వాళ్ళను చంపినది బిచ్చం ఎత్తుకోవటానికా? ఈ సంగతి ముందే తెలిస్తే మేం ఆయుధాలు పట్టుతామా? ఇంత మందిని చంపుతామా? శక్తి కొద్దీ మేమూ బిచ్చమే ఎత్తుకునేవాళ్ళం. నుయ్యి తవ్వి నీరు ఉపయోగించనివాడిలాగా మాట్లాడుతున్నావు. నిన్ను అనవలసినపనిలేదు. నీ మాటకు కట్టుబడి బలవంతులమై కూడా అసమర్థుల లాగా తిరగటం మాదే తప్పు. ఈ మాటలు కట్టిపెట్టి రాజ్యం ఏలుకో,'' అన్నాడు.

నకుల సహదేవులు కూడా ధర్మరాజును ఈ విధంగానే హెచ్చరించారు.

తరవాత ద్రౌపది ఇలా చెప్పింది :

''నీ తమ్ములు చెప్పినట్టు చెయ్యి. వాళ్ళు అరణ్యవాసంలో పడరాని కష్టాలు పడుతున్నప్పుడు, ఈ కష్టాలు ఎల్లకాలం ఉండవనీ, త్వరలోనే దుర్యోధనుణ్ణి జయించి రాజ్యం సంపాదించుకొంటామనీ నువ్వు వారిని ఓదార్చినమాట గుర్తుతెచ్చుకో. అప్పుడు



అలా అని ఇప్పుడు ఈ మాటలంటే వీరికి నిరుత్సాహం కలుగుతున్నది. పూర్వం నువ్వు అనేక రాజ్యాలు జయించినది యుద్ధం చేసి కాదా? రాజ్యం సంపాదించటానికి మరో మార్గం ఏదైనా ఉన్నదా? ఇలాగే మాట్లాడితే, 'ధర్మరాజుకు మతిపోయింది,' అంటారు. అంబరీషుడూ, మాంధాతా లాటి మహామహులు రాజ్యాలు ఏలారు.''

ఇంకా అనేకమంది రుషులు ధర్మరాజుకు హితోపదేశం చేశారు. వ్యాసుడు ధర్మరాజుతో, ''తనను చంపవచ్చిన వాడు వేదవేదాంగ పారగుడైనా చంపవచ్చును. అందువల్ల బ్రహ్మహత్యాదోషం కలగదు,'' అని చెప్పాడు.

తన తమ్ములేగాక, దేవస్థానుడూ, వ్యాసుడూ, కృష్ణుడూ కూడా చెప్పిన మీదట ధర్మరాజు తన విచారానికీ, అనుమానాలకూ స్వస్తి చెప్పి, రాజ్యం ఏలనిశ్చయించాడు.



ధర్మరాజు కోసం రథం సిద్ధమయింది. దానికి పదహారు తెల్లని ఎద్దులు కట్టి తెల్లని స్తంభాలు అమర్చారు. పగ్గాలు పట్టుకుని భీముడు సారథి స్థానంలో కూర్చున్నాడు. అర్జునుడు ధర్మరాజుకు తెల్లని గొడుగు పట్టాడు. నకుల సహదేవులు ఆయనకు వింజామరలు పట్టారు. ధర్మరాజు ఎక్కిన రథం వెనకగా యుయుత్సుడి రథం కదిలింది. దాని వెనక కృష్ణ సాత్యకులు రెండు గుర్రాలు లాగే రథంలో వెళ్ళారు. ఈ ఊరేగింపు ముందుగా ఒక పల్లకిలో గాంధారీ, ధృతరాష్ట్రులూ, కౌరవస్త్రీలూ, కుంతీ, ద్రౌపదీ వేరు వేరు వాహనాలలో విదురుడి వెంట బయలుదేరారు. వెనకగా చతురంగబలాల సేన వచ్చింది. వందిమాగధులు స్తోత్రపాఠాలు చదువుతూండగా ధర్మరాజు హస్తినాపురానికి చేరుకున్నాడు. నగరం అంతా చక్కగా అలంకరించి ఉన్నది. అంతటా తెల్లని పూల తోరణాలూ, తెల్లని జెండాలూ ఉన్నాయి. వైభవంగా ధర్మరాజు పుర ప్రవేశం చేసేటప్పుడు వేలకొద్దీ పౌరులూ, పౌరకాంతలూ చూడటానికి వచ్చి వీధుల నిండా నిలబడి, హర్షం వెలిబుచ్చారు.

మంత్రులూ, తదితర ప్రముఖులూ వచ్చి, ''రాజేంద్రా, మా భాగ్యం చేత నువ్వు శత్రువులను జయించి, ధర్మంగా తిరిగి రాజ్యం పొందావు,'' అన్నారు.

బ్రాహ్మణులు ధర్మరాజును ఆశీర్వదించారు.

ధర్మరాజు రాజమందిరం ప్రవేశించి, సౌమ్యుడికీ, ధృతరాష్ట్రుడికీ నమస్కరించి, దేవతారాధన చేశాడు. ఇంతలో పెద్ద కలకలం పుట్టింది. దుర్యోధనుడికి మిత్రుడైన చార్వాకుడు అనేవాడు ధర్మరాజును సమీపించి, ''జ్ఞాతులను చంపి నువ్వు ఏమి అనుభవిస్తావు? నువ్వు ఇలా బతకకపోతేనేం?'' అన్నాడు.

ఈ మాట విని ధర్మరాజు సిగ్గుపడుతూ, బ్రాహ్మలకేసి తిరిగి, ''నన్ను అనుగ్రహించండి. అసలే విచారంలో ఉన్న నన్ను నిందించ వద్దు,'' అన్నాడు.

దానికి బ్రాహ్మణులు, ''రాజా, ఈ చార్వాకుడి అభిప్రాయం మా అభిప్రాయం కాదు. వీడు దుర్యోధనుడి స్నేహితుడు. అందుకని ఇలా అంటున్నాడు. నీకూ, నీ తమ్ములకూ అశుభం కలుగబోదు,'' అని, అందరూ కలిసి ఆ చార్వాకుణ్ణి వెంటనే చంపేశారు.

ధర్మరాజుకు మనశ్శాంతి కలగటానికి కృష్ణుడు చార్వాకుడు కృతయుగంలో ఒక

రాక్షసుడనీ, వాడు బదరీవనంలో తపస్సు చేసిబ్రహ్మను ప్రత్యక్షం చేసుకుని, బ్రాహ్మల నుంచి తప్ప ఇతరుల వల్ల చావు లేకుండా వరంకోరాడనీ యుక్తిగా ఒక కథ చెప్పాడు.

తరవాత ధర్మరాజు యధావిధిగా రాజ్యాభిషిక్తుడయ్యాడు. ధౌమ్యుడు ఒక వేదిక నిర్మింపజేసి, దానిపైన పులిచర్మం పరిపించి, దానిపైన ధర్మరాజునూ, ద్రౌపదినీ కూర్చోబెట్టాడు. ధౌమ్యుడు అగ్నిచేసి, ధర్మరాజుచేత అందులో హోమం చేయించాడు. తరవాత కృష్ణుడు ఒక శంఖంతో ధర్మరాజును అభిషేకించి, భూమికంతటికీ మహారాజువు కమ్మన్నాడు.ఇందుకు ధృతరాష్ట్రుడూ, ప్రజలూ ఆమోదించారు. మంగళ ధ్వనులు మోగాయి. ధర్మరాజు బ్రాహ్మణ సత్కారం చేశాడు.

ఆయన ప్రజలతో, ''మహాజనులారా. మహారాజు ధృతరాష్ట్రుడే మాకు దైవం. మాపై అభిమానంగల వారందరూ ఆయన శాసనాన్నే సర్వవేళలా శిరసావహించాలి. మేము జీవించి ఉన్నది ఆయనకు సేవ చెయ్యటానికే. నాకూ, మీకూ కూడా ఆయనే ప్రభువు!''అన్నాడు.

తరవాత ధర్మరాజు భీముణ్ణి యువరాజుగా ప్రకటించి, విదురుణ్ణి మంత్రిగా నియమించాడు. సంజయుడు కోశాధికారీ, ప్రధానసలహాదారూ అయ్యాడు. నకులుడు భృత్యుల వేతనాలు నిర్ణయించటానికీ, అర్జునుడు రాజ్యక్షేమం చూడడానికీ ధౌమ్యుడు దేవబ్రాహ్మణ కార్యాలకూ నియుక్తులైనారు. సహదేవుడిపని అన్నివేళలా ధర్మరాజు అవసరాలుచూస్తూ వెంట ఉండటం.

తరవాత, యుద్ధంలో చచ్చిన వారందరికీ శ్రాద్ధాలు పెట్టారు. భూదానాలిచ్చారు. ధృతరాష్ట్రుడు తన కొడుకులకూ, ధర్మరాజు ద్రోణుడికీ, కర్ణుడికీ, దృష్టద్యుమ్నుడికీ, ఘటోత్కచుడికీ, అభిమన్యుడికీ విడివిడిగా శ్రాద్ధాలు పెట్టారు. చచ్చిపోయిన వారి జ్ఞాపకార్థం ధర్మసత్రాలూ, చలిపందిర్లూ, చెరువులూ నిర్మించారు.

తరవాత ప్రజల క్షేమం పాటిస్తూ ధర్మరాజు రాజ్యం చేయసాగాడు.



పరోపకారి చిన్నడు

# పిశాచి నాటకం - 2

చిత్రాలు : పాణి

చిన్నడు మారువేషంతో వెళ్ళి తలుపుతట్టగానే గోవిందశెట్టి తలుపు తెరిచాడు.

''ఏమిటీ? నువ్వెవరు? ఏం కావాలి?''

''మంగయ్యశెట్టి కావాలి.''

మారువేషంలో వున్న చిన్నడు లోపలికి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

''నేను జోగిందర్ కొడుకును. మీ నాన్నగారెక్కడ?''

''ఆయన మానాన్న గారు,ఎప్పుడో చనిపోయారు. ఆయనతో నీకేం పని?''

''ఆయన మా నాన్నగారికి లక్షవరహాలు బాకీ ఉన్నాడు. బాకీ వసూలు కోసమే వచ్చాను. ఆ డబ్బు ఇచ్చి నన్ను తొందరగా పంపించే ఏర్పాటు చూడు!''

''ఆ, ఏమిటీ? మా నాన్న గారు మీ నాన్నగారికి లక్ష వరహాలు బాకీ ఉన్నాడా? వాటిని నేను నీకు ఇవ్వాలా? బావుంది! ఉండడానికి ఇల్లు తప్ప నా దగ్గర చిల్లిగవ్వ లేదు. కావాలంటే చూసుకో!''

గోవిందశెట్టి ఇనప్పెట్టెతో సహా పెట్టెలన్నిటినీ చూపాడు.

PAANI
















ఆ తరవాత ఏం చేయాలా అని ఆలోచిస్తూ చిన్నడు అక్కడినుంచి బయలుదేరాడు.


"అయ్యో! నిజంగానే ఆ పిశాచం వెంటపడితే నాగతి ఏంకాను?"
గోవిందశెట్టికి మతిపోయినట్టయింది.


అర్ధరాత్రి సమయంలో గోవిందశెట్టి మర్రి చెట్టుకిందికి వెళ్ళి పిశాచివేషం వేసుకున్నాడు.


ఈ నిర్జన ప్రదేశంలో పిశాచాన్ని ఎదుర్కొనేకన్నా, ధనాన్ని ఇంటికి తీసుకుపోవడమే మేలు.


గోవిందశెట్టి ధనం పాతిన చోట తవ్వి, లంకె బిందెలు పైకి తీశాడు. అంతలో...


చెట్టుపైనుంచి గోవిందశెట్టి ముందు చిన్నడు దభీమని దూకాడు.


గోవిందశెట్టి భయంతో కెవ్వున కేక పెట్టాడు.


చిన్నడు అతన్నిపట్టుకుని మఱ్రిచెట్టుకు కట్టేసి, భైరవాన్ని కాపలావుంచి ఊళ్ళోకి వెళ్ళాడు.


"పిశాచి నాటకం చరమాంకానికి వచ్చింది. మీకందరికీ అసలు మంగయ్యశెట్టి పిశాచాన్ని చూపిస్తాను ధైర్యంగా నా వెంట రండి."


"మన గోవిందశెట్టి! ఇతడా పిశాచం!"
"ఎంత మోసం!"
"ఎంత మోసం! ఎంత మోసం!"


"తన తండ్రి అక్రమంగా సంపాదించిన ధనాన్ని మీ కంటబడకుండా కాపాడు కోవడానికి గోవిందశెట్టి వాటిని లంకెబిందెలలో పెట్టి ఇక్కడ దాచి, తన తండ్రిపిశాచం అయినట్టు మిమ్మల్ని నమ్మించి మోసం చేశాడు. దయ్యాలూ, పిశాచాలూ అని మీరు భయపడినంత కాలమూ మిమ్మల్ని ఎవరు పడితే వాళ్ళు తేలికగా మోసం చేయగలరు! మీ బతుకులు బండలైపోతాయి! జాగ్రత్తగా మసలుకోండి!"
గోవిందశెట్టినీ, లంకెబిందెలనూ గ్రామాధికారికి అప్పగించి చిన్నడు భైరవంతో సహా మరో ఊరికి బయలుదేరాడు.



# మూలికా రహస్యం

కొంతకాలం క్రితం కపిశానగరంలో మాధవుడనే సంపన్నుడుండేవాడు. అతని అత్తవారు కూడా ధనికులు. అందుచేత అతను కాలిమీద కాలు వేసుకుని, సుఖంగా ఎంతకాలమైనా జీవించడానికి అవకాశం వుంది. కాని మాధవుడు అలా తిని కూర్చునే ఘటం కాదు. అతనికి రసవిద్య సాధించాలన్న కోరిక చాలా బలంగా ఉండేది. రాగిని బంగారంగా మార్చడానికి అతను ఎన్నో ప్రయోగాలు చేసి, తనకున్నదంతా విపరీతంగా ఖర్చు పెట్టి, చివరకు నిరుపేద దశకు చేరుకున్నాడు.

మాధవుడి భార్య చాలా వివేకంగల మనిషి. నిక్షేపంగా అనుభవించదగిన ఆస్తిని తన భర్త బంగారం మీది వ్యామోహంతో, సాంతం తగలేస్తాడని ఆమె ముందే గ్రహించి, కొంతలో కొంతయినా నిలబెట్టడానికి గృహ నిర్వహణలో ఎంతో శ్రద్ధ చూపింది.

కాని ఆమె శ్రద్ధ అంతా బూడిదలో పోసిన పన్నీరులా అయింది. ఇతరుల మాదిరిగా తన భర్త ఏ వ్యాపారమో చేసుకున్నా ఎంతో బాగుండిపోయేది. రేయీ పగలూ ఎప్పుడు చూసినా బంగారం మీదనే దృష్టి గల మాధవుడికి, భార్య చేసిన హెచ్చరికలూ, సూచనలూ ఏమాత్రమూ తలకెక్కలేదు. పైపెచ్చు, ఒకవంక ఆస్తి అంతా హారతి కర్పూరంలాగా హరించుకుపోతుంటే, అతను భార్యతో, ''తొందరపడకు. కొన్ని రోజులు ఓపిక పట్టు.మనదశ తిరుగుతుంది. బంగారం చేసే విద్య చాలావరకు దొరికిపోయింది. ఇంక కాస్తలో ఉన్నది,'' అన్నాడు.

కొన్నాళ్ళు గడిచేసరికి మాధవుడి భార్యకు పరిస్థితి దుర్భరమయింది. ఆమె పుట్టింటికి వెళ్ళి, తన తండ్రితో తన కాపురం గురించి చెప్పింది. ముసలాయన అంతావిని, ''అల్లుణ్ణి పిలిచి, నేను మాట్లాడుతాలే.నువ్వు బాధ పడకు,'' అన్నాడు.

మామగారి ఆహ్వానం అందుకుని మాధవుడు వచ్చాడు.

"ఏమోయ్, నీ రసవిద్య ఎంత దాకా వచ్చింది?" అని మామగారు నవ్వుతూ అడిగాడు.

మాధవుడు ఉత్సాహంతో తాను చేసిన ప్రయోగాలన్నిటిని గురించీ మామగారికి వివరంగా చెప్పాడు.

"అరరె, అసలు కిటుకు తెలీక ఇన్ని ఏళ్ళు వృథా చేస్తివే. ఈ విషయంలో నా సలహా ఏనాడో తీసుకోవలిసింది. నేను కూడా ఈ విద్య గురించి చాలా తెలుసుకున్నాను. ఎన్నో ప్రయోగాలు కూడా చేశాను. ఇప్పటి కైనా నీ పని సులువని చెప్పను. చాలా ఏళ్ళపాటు నువ్వు ఓర్పుతో పని చేయవలసి ఉంటుంది. నాకు వృద్ధాప్యం వచ్చేసింది. నేను శ్రమపడలేను. ఆ పని నీ వల్ల అవు తుంది. నేనెరిగిన మూలికా రహస్యం నీకు చెప్పేస్తాను. నేను చెప్పినట్టు చేయి, నీ కోరిక సిద్ధిస్తుంది," అన్నాడు మామగారు.

మాధవుడు భక్తిగా, "మామగారూ, మీరు చెప్పింది తుచ తప్పకుండా శ్రద్ధగా చేస్తాను. రసవిద్యలో విజయం సాధించేదాకా విడిచి పెట్టను," అన్నాడు.

"నువ్వు ఇంతకాలమూ రాగిని బంగా రంగా మార్చటానికి కదా అహర్నిశలు శ్రమి స్తున్నావు? అందుకు కావలసిన వస్తుసామగ్రి యావత్తు నా వద్ద ఉన్నది — ఒక్క దినుసు తప్ప. మన ఓర్పును పరీక్షించి, హెచ్చుగా శ్రమ పెట్టే దినుసు కూడా అదే. అయితే దాన్ని సాధించటం అసాధ్యం మట్టుకు కాదు," అన్నాడు మామగారు.

"ఆ దినుసేమిటో చెప్పండి" అన్నాడు మాధవుడు పట్టరాని ఉత్సాహంతో.




"మరేమీ లేదు. అరిటాకుల మీద నూగు ఉంటుంది, చూశావూ? అది ముక్కాలు వీశె సేకరించాలి. అందులో మరొక చిక్కేమి టంటే, ఆ నూగు పోగు చేసే చెట్లను నువ్వే, నీ చేతి మీదుగా, మంత్రసహితంగా నాటి పెంచాలి. ఆ మంత్రం నేను ఉపదేశిస్తాను," అన్నాడు మామగారు.

"చాలా చెట్లు నాటవలసి ఉంటుం దనుకుంటాను?" అన్నాడు మాధవుడు నెమ్మదిగా. "అందులో పట్టుదల ఉండాలే తప్ప అది అసాధ్యమేమీ కాదు. సందేహ మేమిటి? చాలా ఎకరాల తోట కావలసి ఉంటుంది. లేకపోతే ముక్కాలు వీసెడు నూగు ఎప్పటికి సంపాదించేట్టు?" అన్నాడు మామగారు.

మాధవుడు పొలం కొని అరటితోట వెయ్య టానికి మామగారు ఆర్థికంగా సహాయం చేశాడు. కూలీలు భూమిని బాగుచేసి,




అరటి మొక్కలకు గుంటలు తవ్వారు. మాధవుడు, మామగారు చెప్పిన మంత్రం చదువుతూ, అరటిమొక్కలన్నిటినీ భక్తితో నాటాడు.

మొక్కలు ఎదిగి వచ్చాయి. మాధవుడు రోజంతా తోటలో తిరిగి ప్రతి ఆకునుంచీ నూగు తీసేవాడు. రెండు మూడు రోజులు అలా తీసిన నూగు తూచి చూస్తే, తన మామ గారు చెప్పిన మాటలు అక్షరాలా నిజమని అతనికి తోచింది. తొందరపడి ఏమీ లాభం లేదు. ఇలా ముక్కాలువీసె నూగు సంపాదించటానికి ఎంతో కాలం పట్టుతుంది. ఎంతో ఓపిక కూడా కావాలి.

మాధవుడి దృష్టి అంతా అరిటాకుల మీది నూగుపైనే ఉన్నది.

అతని భార్య నిత్యమూ అరటిఆకులూ, గెలలూ, అరటి దూటా అమ్మి బోలెడంత డబ్బు వెనక వేస్తున్నది. వాటిని గురించి మాధవుడికి గమనమే లేదు. అరటి ఆకు నూగు ఎప్పటికి ముక్కాలు వీసెడు అవుతుందా, ఎప్పుడు రాగిని బంగారంగా మార్చ గలనా అన్న ధ్యాసతప్ప అతనికి మరో ధ్యాస లేదు. అతడు రోజూ తోటకు వెళ్ళి నూగును సేకరిస్తున్నాడు. ఉత్సాహంకొద్దీ అక్కడే తూకం వేసి చూస్తున్నాడు.రాత్రీ, పగలూ దానినిగురించే కలలుకంటున్నాడు.

మూడేళ్ళు గడిచినా మాధవుడి లక్ష్యం కనుచూపుమేరలో లేదు. కాని తోట మీద అతని భార్య సాగించే వ్యాపారం మూడు పువ్వులూ, ఆరు కాయలూగా ఉన్నది.

బళ్ళకొద్దీ అరటిగెలలూ, ఆకులూ, పూలూ, దూటా పక్క పట్టణాలకు రవాణా అయి పోతున్నాయి. కొన్ని మైళ్ళమేర ఆ అరటి తోటకు పోటీ లేదు.

మరో రెండేళ్ళు గడిచాయి. మాధవుడి దీక్ష ముగిసింది. అతను ముక్కాలువీసెడు నూగు సేకరించాడు. అతనుదాన్ని మామ గారి ముందుంచి, "ఇదుగో, మామగారూ, మీరు చెప్పినంత నూగూ పోగుచేసితెచ్చాను," అన్నాడు.

"భేష్, ఇక నీకు డబ్బులోటు ఉండ దోయ్!" అంటూ మామగారు నవ్వాడు. ఆయన తన కుమార్తెకేసి తిరిగి, "అరటి తోట మీద నువ్వెంత సంపాదించావమ్మా?" అని అడిగాడు.

మాధవుడి భార్య డబ్బుసంచీ తెచ్చి, "మీరే లెక్క చూడండి," అన్నది.

అరటితోట మీద తన భార్య సంపాదించట మేమిటో మాధవుడికి అర్థం కాలేదు. అరటి తోట యొక్క ప్రయోజనం నూగు సంపా దించటమూ, దానితో రాగిని బంగారం చెయ్యటమూ అని మాధవుడు ఇంతకాలంగా అనుకుంటున్నాడు.

మామగారు సంచీని కుమ్మరించి, డబ్బులు ఎంచి "ఇరవైవేలరూపాయలు!" అన్నాడు.

ఆ డబ్బుకేసి చూసి మాధవుడు నిర్ఘాంత పోయాడు.

"నా సలహా ఎంత ఉపకరించిందో చూశావు టోయ్? కావలిస్తే ఈ వెండికి మేలిమిబంగారం కొనుక్కోవచ్చు. నగలూ, ఏనుగులూ, ఏది కావాలంటే అది కొనుక్కోవచ్చు. ఈ అయి దేళ్ళూ నీచేత పని చేయించిన శ్రమ నీకు తెలియకుండానే ఫలించిందని ఒప్పుకుం టావు కదూ? రాగి నుంచి బంగారం చేయ డానికి నువ్వు చేసిన రసప్రయోగం కంటే ఇది నయమే కదా!" అన్నాడు మామగారు.

మాధవుడికి కళ్ళు తెరుపుడు పడ్డాయి. మామగారు తనను మోసం చేసినా, మంచి గుణపాఠం నేర్పాడు, ఎంతో లాభం కూడా కలిగించాడు. కామధేనువు లాంటి అరటి తోట ఉండగా తనకు డబ్బు లోటంటూ ఉండదు. అతను తన మామగారికి క్షమా పణతోబాటు కృతజ్ఞత కూడా తెలుపుకుని భార్యతో సహా తోటవ్యాపారం చేసుకుంటూ సుఖంగా జీవించాడు.





# మనదేశం గురించి తెలుసుకుందాం!

## క్విజ్

జనవరి రాగానే అందరికీ బ్రహ్మాండమైన రిపబ్లిక్ డే పెరేడ్ గుర్తుకు వస్తుంది. దానికి సంబంధించిన కొన్ని విశేషాలను ఈ క్విజ్‌లో తెలుసుకుందాం.

1. మొట్టమొదటి రిపబ్లిక్ డే పెరేడ్ ఎప్పుడు జరిగింది?
2. పెరేడ్‌లో వందనస్వీకారం ఎవరు చేస్తారు?
3. ఆయనకు ఎవరు స్వాగతం పలుకుతారు?
4. పెరేడ్ ఎక్కడ ఆరంభమై, ఎక్కడ ముగుస్తుంది?
5. పెరేడ్‌కు ముందు లాంఛనప్రాయంగాచిన్నకార్యక్రమం ఒకటి జరుగుతుంది.అదిఎక్కడ జరుగుతుంది?ఏం జరుగుతుంది? అందులో పాల్గొనే అతిథి ఎవరు?
6. కొన్ని సందర్భాలలో పతాకావిష్కరణ తరవాత అక్కడొక చిన్న కార్యక్రమం జరుగుతుంది. దాని పేరేమిటి?
7. గత సంవత్సరం జరిగిన రిపబ్లిక్ డే పెరేడ్‌లో పాల్గొన్న ముఖ్య అతిథి ఎవరు?
8. ఆ పెరేడ్‌లో వివిధ రాష్ట్రాలూ, కేంద్రపాలిత ప్రాంతాలూ ఎలా పాల్గొంటాయి?
9. పెరేడ్ పిల్లల విభాగాన్ని ఎవరు ముందుండి నడిపిస్తారు?
10. పెరేడ్‌లో ఆఖరి అంశం ఏమిటి?
11. పెరేడ్‌లో భాగం కాకపోయినప్పటికీ, మూడురోజుల తరవాత జరిగే ఒక కార్యక్రమంతో రిపబ్లిక్ దినోత్సవాలు సమాప్తమవుతాయి. దానిపేరేమిటి? ప్రాధాన్యత ఏమిటి?
12. జనవరి 26వ తేదీ ప్రాముఖ్యత ఏమిటి?

[సమాధానాలు వచ్చే సంచికలో]




























All thanks to the cheese that has more milk in it.








# అంటరానివాడు!

పవిత్ర గోదావరీ తీరంలో పర్ణశాల నిర్మించుకుని ఒక సాధువు నివసిస్తూండేవాడు. అక్కడికి సమీపంలో వున్న గ్రామప్రజలకు ఆయనంటే చాలా భక్తి. అంతటి గొప్ప సాధువు, తమకు సమీపంలో వుండడం తలుచుకుని వాళ్ళెంతో పొంగిపోయేవారు. ఆహారంలాంటి ఆయన కనీస అవసరాలను కూడా వాళ్ళే తీర్చేవారు!

ప్రజలు తనపట్ల చూపుతూన్న భక్తి ప్రపత్తులను గమనించి, సాధువు తన మాటే వాళ్ళకు వేదం అనుకునేవాడు. ఆయన రోజూ వేకువజామున లేచి, నదిలో స్నానం చేసి నీళ్ళకు ఆనుకుని వున్న ఒక పెద్ద బండమీద కూర్చుని ధ్యానం చేసేవాడు. ఆ సమయంలో ఎవరూ అటువైపు వచ్చి తనకు ధ్యానభంగం కలిగించవద్దని ఆయన ప్రజలకు చెప్పాడు.

గ్రామప్రజలు సాధువు మాటను శిరసావహించి ఆ దరిదాపులకు ఎవరూ వెళ్ళేవారు కారు. పొద్దున ఎవరైనా స్నానం చేయాలనుకున్నా, దూరంగా వెళ్ళి చేసేవారు.

ఒకనాటి ఉదయం సాధువు యథాప్రకారం స్నానం చేసి బండమీద కూర్చుని కళ్ళు మూసుకుని ధ్యానానికి ఉపక్రమించాడు. అప్పుడు తనకు కుడివైపున అతి సమీపంలో ఎవరో నదిలోకి ఉరికారని తెలిసి సాధువు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. ఒక కుర్రవాడు నదిలో ఉత్సాహంగా ఈదుతూ ఉండడం వల్ల నీటి తుంపరలు చెదిరి సాధువు మీద పడ్డాయి. సాధువు పట్టరాని కోపంతో, ''అప్రాచ్యుడా! ఎంత పొగరు! ఎంత పొగరు!'' అంటూ లేచి నిలబడ్డాడు.

అయితే, ఆనందంతో నదిలో ఈదుతూన్న కుర్రవాడు సాధువు మాటలను ఏమాత్రం పట్టించుకోలేదు. నిజానికి ఈత కొట్టడం వల్ల లేచే అలల శబ్దంలో సాధువు మాటలేవీ వాడి చెవిలో పడలేదు.

కుర్రవాడు ఈదడం పూర్తి చేసి, గట్టెక్కడంతో సాధువు గబగబావెళ్ళి, "పిల్లదయ్యమా!" అంటూ వాణ్ణి లాగి లెంపకాయ కొట్టాడు!

అంతలో ఒక యువకుడు అక్కడికి రొప్పుతూ, రోజుతూ పరిగెత్తివచ్చి, సాధువుకు దూరంగా నిలబడి, చేతులెత్తి మొక్కుతూ, ''స్వామీ! క్షమించాలి. వీడు నా భార్య తమ్ముడు. దూరగ్రామం వాడు. మీరు పొద్దున చేసే ధ్యానం గురించి వాడికి తెలియదు. ఇంటి దగ్గర కనిపించకపోయే సరికి, ఈతంటే వాడికి చాలా ఇష్టం గనక, ఇక్కడికే వచ్చి వుంటాడని ఊహించి, మీ ధ్యానానికి భంగం కలిగిస్తాడేమోనని పరిగెత్తుకుంటూవచ్చాను. అయినా ఆలస్యమైపోయింది,'' అన్నాడు.

''నీ బావమరిదా వీడు?'' అంటూ సాధువు శాంతించాడు. ఆ తరవాత, వచ్చినవాడు అస్పృశ్యుడని సాధువు గ్రహించడంతో, వాడి బావమరిది కూడా అస్పృశ్యుడే అయివుంటాడని భావించి, మౌనంగా వెళ్ళి, మళ్ళీ ఒకసారి స్నానం చేసి వచ్చాడు.

దీన్నంతా చూసిన కుర్రవాడు మళ్ళీ ఒకసారి నదిలోకి దిగి స్నానం చేసి వచ్చాడు.

''మళ్ళీ ఎందుకు స్నానం చేశావు?'' అని అడిగాడు వాడి బావ.

''సాధువు కూడా ఒకసారి స్నానం చేసి నుదుట విభూదిరేఖలు దిద్దుకున్నాడు కదా! మరి మళ్ళీ ఎందుకు స్నానం చేసినట్టు?'' అని అడిగాడు కుర్రవాడు.

''మనం అంటరానివాళ్ళమన్న సంగతి నువ్వు మరిచిపోయావా? ఆయన నిన్ను లెంపకాయ కొడుతూ తాకాడు కదా? అందుకే మళ్ళీ వెళ్ళి స్నానం చేశాడు,'' అన్నాడు బావ.

''నన్ను లెంపకాయ కొట్టినప్పుడు ఆయన కోపంతో నాకు దయ్యంలా కనిపించాడు. దయ్యం కూడా అంటరానిదే కదా? అది నన్ను ముట్టుకున్నది గనక స్నానం చేశాను!'' అన్నాడు కుర్రవాడు.

ఆ మాట సాధువుకు లెంపకాయలా తగిలింది. నోటమాటరాక ఒక్క క్షణం స్థాణువులా నిలబడ్డాడు. ఆ తరవాత ఆయన కుర్రవాణ్ణి సమీపించి, ''నిజం నాయనా! ఒక్క దయ్యం కాదు. అహంభావం, ఆగ్రహం అనే రెండు దయ్యాలు నన్ను ఆవహించాయి. అంటరానివాణ్ణి నేనే కాని నువ్వు కాదు,'' అంటూ తన పాదాలకు నమస్కరించిన కుర్రవాణ్ణి ఆప్యాయంగా లేవనెత్తాడు.





# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

ఫోటో వ్యాఖ్యల పోటీ, చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097





వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్ కార్డుపైన రాసి ఈ నెల 25 వ తేదీ లోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు మార్చ్ 2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.






నవంబర్ 2000 నెల సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు :

ఆర్. వెంకటేశ్వరరావు
S/o వీరరాఘవులు
41-21-67, స్వర్గపురిరోడ్, బి.పురం,
కె.లంక, విజయవాడ- 520013 (ఆం.ప్ర)

మొదటి ఫోటో : సాధనకు తోడు ఆసరా!

రెండవ ఫోటో : సాహసమే తోడు నీడరా!!

